# కొత్త పాఠాలు





బోయ జంగయ్య

బోజ : కథలు

**కొత్త పాఠాలు**

ప్రచురణ : బోయ చేతన్

ప్రతులు : వేయి

హక్కులు : రచయితవి

బొమ్మలు : అంజయ్యచారి

ముఖచిత్రం : శ్రీనివాస్

❑

ప్రతులకు :

ప్రగతి పబ్లిషింగ్ హౌస్

5-9-214, మాన్యంచెలుక

నల్లగొండ - 508 001.

ఫోన్ నెం. 32515

❑

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

బ్యాంక్‌స్ట్రీట్, హైదరాబాద్.

❑

దిశ బుక్ హౌస్

కాచిగూడ, హైద్రాబాదు.

❑

మైత్రి బుక్‌హౌస్,

విజయవాడ.

❑

ముద్రణ

అనుపమ ప్రింటర్స్

శాంతినగర్, హైద్రాబాదు - 28.

ఫోన్ : 3304194, 3391364

❑

వెల : రు. 30/-

ప్రముఖ రచయిత

'వాణిశ్రీ'కి

స్నేహపూర్వకంగా -

బోజ

# ఇందలి కథలు

## ఈ కథలు -

గతంలో దయ్యాల -భూతాల గూర్చి, సింహం - కుందేలు గూర్చి, అనగనగా ఓ రాజు, ఆరాజుకు - ఏడుగురు కొడుకుల గూర్చి కథలు చెప్పేవారు. వాటికి తోడు కొన్ని నీతికథలు చెప్పేవారు. అంతేకాకుండా సాహసవీరుల గూర్చి కథలు చెప్పేవారు. ఆ వీరుడు ఎప్పుడైన ఆపదలో చిక్కుకుంటే ఏదో అద్భుతశక్తిని పుట్టించి ఆ ఆపదలోనుండి అతనిని గట్టెక్కించేవాళ్లు. ఈలాంటి కథలు ఈ కాలంలోనూ చదివించడం సమంజసం కాదేమో! ఇది కంప్యూటర్ కాలం. కాలానుగుణ సాహిత్యం అవసరం కదా ? బాలబాలికలు రోజూ స్కూళ్ళల్లో, ఇండ్లల్లో, వీధులల్లో, చూస్తున్న, వింటున్న, ఎదుర్కొంటున్న సమస్యల గూర్చి తెలిపే ఆధునిక సాహిత్యం ఎంతైనా అవసరం. పాతకథల్లో లాగ వాళ్లు సమస్యల్లో చిక్కుకున్నప్పుడు ఏ అద్భుతశక్తో అదుకోదుకదా? తనకు తానే ఎదురుకోవల్సివుంటుంది కనుక వాళ్లను మొదటినుండే ఆలోచనపరులుగ తీర్చిదిద్దవల్సివుంది. ఇంట్లో, బడిలో చెప్పని కొన్ని విషయాలను మనం ఈలాంటి పుస్తకాల ద్వారా చెప్పవల్సివుంది. వాళ్లకు నిజజీవితంలో ఎదురయ్యే సమస్యల చిక్కులను విడదీసుకునే కిటుకును నేర్పవల్సివుంది. అందుకే ఈ కొత్తపాఠాలు కథలను పిల్లల ముందుంచుతున్నాను. చదవండి.

**బోయ జంగయ్య**

5-7-214, మాన్యంచెలుక,
నల్లగొండ - 508 001.
ఫోన్ : 32515

## మామాట -

క్రితంలో మేము ప్రచురించిన 'అంబేద్కర్', 'బడిలో చెప్పని పాఠాలు' అనే బాలల సాహిత్యానికి మంచి ఆదరణ లభించింది. ఎక్కువ సంఖ్యలో కూడ అమ్ముడు పోయాయి. కారణం తెలుగులో, బాలల సాహిత్యం గూర్చి అటు రచయితలు ఇటు ప్రచురణ కర్తలు అంతగా పట్టించుకోక పోవటమే అనిపిస్తూ వుంది. ఏది ఎట్లున్నా మేము కొంత ధైర్యం చేసి పై పుస్తకాలను ప్రచురించాం. ముద్రణ ఖర్చులు బాగ పెరిగిపోయిన ఈ రోజుల్లో పుస్తకం ధర కూడా బాగానే పెట్టవలసినా, మేము కాస్త సరసమైన ధరనే పెడుతువున్నాం. ఇతర వస్తువులను ఎంత ధర అయినా పెట్టి కొనగలిగిన తెలుగువాళ్లు ఓ పుస్తకాన్ని కొనే వరకొచ్చేసరికి లెక్కలు గట్టి, పుస్తకాన్ని ఓసారి తిరుగేసి పక్కన పెట్టడం చూస్తూ వుంటాము. 'చినిగిన చొక్కానైనా ధరించుకాని ఓ పుస్తకాన్ని కొను' అన్న నినాదం గుర్తొచ్చినా దాన్ని పక్కన పెట్టేస్తుంటారు. ఏది ఏమైన మీరు ఈ బాలల సాహిత్యాన్ని మీ మీ పిల్లల చేత చదివిస్తారన్న నమ్మకంతో 'ఈ కొత్తపాఠాలు'ను మీముందుంచు తున్నాము. ఈ పుస్తకాన్ని గూడ పై పుస్తకాలలాగానే ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

మీ సేవలో

**బి. చేతన్**

ప్రగతి పబ్లిషింగ్ హౌస్.

# గుజ్జనగూడు



పదిహేను మంది కూర్చోగల మెటాడోర్ వ్యాన్ అది. వ్యాన్ సముద్రపు పక్కమ్మటి పరుగెత్తుతూ ఓ గెస్ట్‌హౌస్ ముందాగింది. ముందుగ క్లీనర్ దిగి నిలుచున్న బండి టైర్లకు రాళ్లుంచాడు. "పిల్లలూ దిగండి. కాసేపు ఈ సముద్రం వొడ్డున కూర్చుందాం" అని టీచర్ అనగానే, అందరు వ్యాన్ దిగి సముద్రాన్ని చూసుకుంటూ కెరటాలతో ఆడుకోవడానికి పరుగెత్తుతున్నారు. సాయం సంధ్య, సూర్యుడు సముద్రంలోకి తొంగి చూస్తువుంటే ఎరుపు పసుపును కలిపి వెదజల్లినట్టు అందమైన ఓ కొత్త రంగై అంతటా పరుచుకుంది. దూరం నుండి ఓ నావ తీరం వైపు వస్తూవుంది.

"జాగ్రత్త నీళ్లలోకి వెళ్లకండి, వొడ్డున్నే ఆడుకోండి" అంటూ టీచర్ అటు యిటూ తిరుగుతూ వాళ్లనే కనిపెట్టుకొని చూస్తూ వున్నాడు. పిల్లలు ఆయనంటే ఎందుకో యిష్టపడతారు.

కొందరు కాళ్లతో యిసుకలో గిరి గీసుకొని "యిదినాది" "అది నీది" అని అనుకున్నారు. వయస్సులో అందరికంటే చిన్నవాడు పదేండ్ల పిల్లాడు పేరు రహీం. తన చెప్పులు పక్కకు

వొదిలి యిసుకలో కాలుంచి దాని చుట్టు యిసుకను అదిమి, మెల్లగ కాలును బయటికి లాగాడు. ఓ చక్కని గూడు తయారైంది. పాదాన్ని తీసేటపుడు యిసుక గూడు కూలిపడిపోనందుకు తృప్తిగా దాని వైపు చూస్తూ ఆనందించాడు. దాని పక్క పక్కనే నడుస్తున్న టీచర్ చిరునవ్వు నవ్వుతూ, రహీం వీపును తాకి ముందుకు నడిచాడు. ఈ లోపల నీళ్లలో ఆడి కాళ్లుచేతులను తడుపుకొని వచ్చిన రాము, శివుడు, రహీం దగ్గరికొచ్చి

"ఏమిటి అలలతో ఆడుకోడానికి రాక ఏంచేస్తున్నావు" ? అని ప్రశ్నిస్తూ రహీం కట్టిన యిసుక గూడును కాళ్లతో కూలతొక్కి నడుంకు చేతులు పెట్టుకొని, తుంటరిగా నవ్వుతూ నిలుచున్నారు.

రహీం పడగెత్తే పాములా లేచి రెండు చేతులతో వాళ్లిద్దరి గల్లాలను పట్టుకున్నాడు. రాము, రహీం జుట్టు, శివుడు గల్లా పట్టుకున్నాడు. రహీం తరపున కొందరు, రాము తరపున కొందరు రంగంలోకి దిగారు. మాటా మాటా పెరగడం ఒకర్నొకరు నెట్టుకోవడం తోసుకోవడం, గమనించిన టీచర్ వాళ్లను సమీపించి, "ఏమిటి గోల" అన్నట్టు చూశాడు. రహీం ఉక్రోషంగా ఒగర్చుతూ

"సార్ నా యిసుక గూడుని కూలగొట్టారు యీళ్లిద్దరు" అంటూ కూలిన గూడును చూపించాడు.

అవునా అన్నట్టు వాళ్లిద్దరివైపు చూశాడు టీచర్.

"ఆడు నా స్థలంలో కట్టుకుంటే కూలగొట్టినం" రాము అన్నాడు.

"కాదు నా జాగ" రహీం చెప్పాడు

"కాదు నాది, కావాలంటే శివున్నడగండి"

"అవును సార్; గిరిగీసి పేరు రాసుకొని మేం నీళ్లవైపు పోయినం, వొచ్చేసరికి వీడు గూడు కట్టుకుండు" శివుడు.

వీళ్లు యిటు రానే లేదు నీళ్లవైపే వున్నారు.

"మీరైతే అందర్ని ఆడుకోమన్నారుగా సార్" శివుడు.

" ఆ ఆడుకోమన్నాను కాని ఒకర్ని ఒకరు కొట్టుకోమన్నానా" రాము తలమీద చేయుంచి "నీవు నీళ్లలో ఆడుకుంటే అతను యిసుకలో ఆడుకున్నాడు. అదే అతనికి ఆనందం దానిని నీవెందుకు కూలగొట్టావు ? నీవు చేసిన పని తప్పు కాదూ ?" అన్నాడు టీచర్.

"కాదు సార్ నేను అక్కడ గూడు కట్టుకుందామని గీతగీసి వెళ్లాను కావాలంటే చూడండి, ఈ పక్క మూర్తి, ఆ పక్క శివుడు, మధ్యన వీడు గూడు కట్టేసిన చోటు నాది. నేను లేనిది చూసి కట్టేసినాడు. వీన్ని అక్కడినుండి వెళ్లమనండి" అంటు ముక్కుపుటలెగరేస్తూ చూపులను అరచేతిలో నిలుపుతూ అన్నాడు.

"ఏయ్ వీడు, గీడు మాటలు మంచిగరానీ" రహీం.

"మరి నా చోటులో నువ్వు ఎందుకు కట్టినవోయ్" ఆవేశంగా అన్నాడు రాము.

"సముద్రపు వడ్డంతా ఖాళీగానే వుంది. చూడు పిల్లలు ఎన్ని యిళ్ళు కడతారో కట్టండి. దీనికోసమే ఎందుకు తగవు? మీరిద్దరు ఒకేక్లాసువాళ్ళు ప్రేమగ కలిసి మెలిసి వుండాలి" యిద్దరి తలల మీద తన రెండు చేతులను ఉంచుతు అన్నాడు టీచర్.

"లేదు నాజాగా నాకు కావాలి" కుడిచేతి మణికట్టుతో ముక్కును తుడుచుకుంటూ అన్నాడు, స్థిరమైన చూపులతో రాము.

"లేదు నా గూడు నాకు యిప్పుడే కట్టియ్యాలె" రహీం, పట్టు పట్టాడు.

"మళ్లీ మొదటికొచ్చారు. కాసేపైతే యిక్కడినుండి వెళ్లిపోతాం. ఎందుకంత పట్టుదల, చిన్న విషయాన్ని పెద్దగ చెయ్యొద్దు" అనివారించాడు.

"నేను కష్టపడి కట్టుకున్నాదాన్ని ఒక్కక్షణంలో తొక్కేశాడు. నాది నాకు ఎట్టుందో అట్ట కావాలి అంతే" అని తాను గూడు కట్టినచోటికి వెళ్లి నిలుచున్నాడు రహీం.

"సరే నేను కట్టిస్తానురా" టీచర్ యిసుకవైపు నడిచాడు.

నలుగురైదుగురు పిల్లలు టీచర్‌ను అనుసరించారు.

"ఆ నాకు యిక్కడే కావాలి" రహీం హఠం చేస్తూ అన్నాడు.

"అది నాది, నేను కట్టుకోవాలి" రాము మరింత మొండి తనాన్ని ప్రదర్శిస్తూ అన్నాడు.

టీచర్ చిరునవ్వు నవ్వుతూ ఈ సమస్యకు ముగింపు పలకాలని అనుకొని "అందరు వెళ్లి వ్యాన్ ఎక్కండి, మీరు పదండి" అన్నాడు.

"చూడు రామూ ఆ భూమి మీ యిద్దరిలో ఏ ఒక్కరి సొంతం కాదు కాసేపటి కోసం మీరు తమదిగ భావించారు అంతే, అవునా?

అవును అన్నట్టు యిద్దరు తలలూపారు.

"అయితే ఒకడు అక్కడ గూడును కట్టుకున్నాక రెండవవాడు దానికి ఆశ పడకూడదు. ఒకవేళ ముందుగానే అక్కడ తనది అని గీతలు గీసుకుంటే మరొకరు వాటిని చెరిపి గూడు కట్టకూడదు. యివి రెండు జరిగిపోయినవి. యిద్దరిలో మనస్పర్థలను పెంచినయి. అసలు ఆ స్థలం ఎవరిది కాదు. ఆ గూడు ఎప్పటికి వుండదు. అందువల్ల ఆవిషయం మర్చిపోండి, పదండి. మీరు పెద్దవాళ్లు అవుతున్నారు. పెద్దమనస్సుండాలి". అన్నాడు టీచర్.

పిల్లలు మౌనంగా ఆయనవెంట నడుస్తున్నారు. అందరి మనస్సులో రకరకాల ఆలోచనలు.

"పిల్లలూ! మీరు తరగతి గదుల్లో విన్న పాఠాల తీరు వేరు, బయటిప్రపంచంలో ఎదురయ్యే సంఘటనలలో భాగస్వాములన్న విషయం గ్రహించి అనుభవాన్ని గడించాలి".

అందరూ "అవునుసార్" అన్నట్టు మధ్య మధ్య టీచర్‌వైపు చూస్తు నడుస్తున్నారు.

"అనుభవం చాలా గొప్ప దర్పణం, మంచి చెడులను మన కళ్లముందే నిల్పుతుంది ఎవరి నీడ వాళ్ల వెంట వున్నట్టే ఎవరి

అనుభవం వారికి అక్కరొస్తుంది. మనం నేర్చుకునే పాఠాలు గూడా అనుభవంలోనుంచే పుట్టాయి" అందరు "అవును" అన్నట్టు తలలూపారు.

"చూడండి యిలాంటి చెడు అనుభవాన్ని తిరిగి చవి చూడగూడదు, విన కూడదు".

అందరు వ్యాన్ ఎక్కారు.

క్లీనర్ "రైట్" అన్నాడు. వ్యాన్ కదిలింది.

తీరం వైపు వస్తున్న పడవ వడ్డుకు చేరువైతుంది.

పడవ నడిపేవాడు పాట పాడుతున్నాడు, చక్కని రాగం, చక్కని భావం !

"మనిషికి - మనిషే తోడురా
మంచి మనిషితోడే ఓ నీడరా -"

వ్యాను వేగం పెరిగింది ఆ పాట రాగం దూరమైంది.

"పాట వింటున్నారా" టీచర్ అడిగాడు.

వింటున్నాం అన్నట్టు అందరు తలలూపారు.

"బాగుంది సార్" మూర్తి, రహీం ఒకేసారి అన్నారు.

ఆ పాటలో చక్కని సాహిత్యం వుంది. ఆలోచింపచేసే మంచి భావమూవుంది. గుండెకు హత్తుకుపోయే రాగము వుంది".

"అయితే కాసేపు ఆగి పాటను పూర్తిగ వినవల్సింది" డ్రైవర్ అన్నాడు.

అవును అన్నట్టు తలవూపి, అదేరాగాన్ని ఆలాపనలా పలువరిస్తున్నాడు టీచర్.

చెట్లమీదనుండి పరుగెత్తుకొస్తున్న చల్లగాలి, సువాసనలు, మోసుకొస్తుంటే పక్షుల అరుపులు చెవుల కింపుగా వినిపిస్తున్నాయి.

అద్దంలో ముఖం చూసుకుంటున్నట్టు సముద్రంలో ఆకాశం. పసుపు పూసుకున్న ముఖానికి ఎర్రటి కుంకుమ బొట్టులాగ అస్తమించబోయే సూర్యుడు.

●

# పుట్టగొడుగులు



సాయంత్రం బడివొదిలారు.

పంతులు తన ఇంటివైపు నడుస్తున్నారు. అటువైపు వెళ్ళవల్సిన మరినలుగురు విద్యార్థులు వెనక నడుస్తువున్నారు. వాళ్ల చేతుల్లో పుస్తకాలున్నాయి. ఓమూల మలుపులో గిరి అనే విద్యార్థి ఎదురైనాడు.

"ఏం రా గిరి ఈరోజు స్కూల్‌కు రాలేదేమి ?" అడిగాడు టీచర్.

"బావి దగ్గరికి వెళ్లాను సార్"

"మరి బడి ఎటుపోవాలిరా"

"బావి దగ్గర పండగ అయితే మానాన్న రమ్మన్నాడు సార్"

"బావి దగ్గరం ఏం పండగర".

"ఉప్పలమ్మ పండగసార్. మా పశువుల దొడ్డివెనక ఉప్పలమ్మ మొలిచింది".

"అయితే"? పంతులు ప్రశ్నించాడు.

"మొలిస్తే, ఏడురోజులు ఓ కొత్తగంప దానిమీద కప్పి, పసుపు కుంకుమ చల్లి వుంచి, ఆ తరువాత గుడి కట్టింద్రు సార్".

"కట్టి"

"కట్టి, సున్నం వేసి, పసుపు కుంకుమ బొట్లు పెట్టి, తెల్లవారుజామున ఓ మేకపోతును నర్కి పండగ చేసింద్రు సార్"

"ఛో ఛో, ఎంత అమాయకుడు మీనాయన" అన్నాడు.

గిరికి ఏమి అర్థంకాక నిలుచుండిపోయాడు. 'మా నాయన ఒక్కడే అట్ల చేసిండా పక్కబాయి దగ్గర పేడకుప్ప దగ్గర అట్లనేచేయిలాగ మొలిస్తే పండగచేసిరి. వాళ్లంత అమాయకులా?' తనలో తాను అనుకున్నాడు.

"మా ఊరిలో చేయిమొలిచితే అందరు అట్లనే పండగచేస్తరు సార్" అన్నాడు బయటికి.

"మీ ఊరివాళ్లకు సైన్స్ తెలియదుర".

"సార్" టీచర్ చెప్పేది వింటునిలుచున్నాడు. మిగతా విద్యార్థులూ వింటున్నారు.

"పిల్లలూ, ఆ పెంట దిబ్బ వైపు చూడండి, యిటువైపు పాత గోడవైపు చూడండి" అన్నాడు. అందరు అటు పెంటదిబ్బ వైపు, పాతగోడవైపు చూశారు.

"మీకు ఏంకనిపిస్తున్నాయి."

"పుట్టగొడుగులు" అన్నారు.

"పుట్టగొడుగులను చూశారుకదా"

చూశాం అన్నట్లు తలలూపారు.

"అవి ఎట్లా వున్నాయి"

"కొన్ని వాడిపోతున్నాయి. మరికొన్ని కొత్తగ వెలుస్తున్నాయి."

"వాడిపోయేవాటిమీద ఏం వాలుతున్నాయి".

"ఈగలు సార్"

" అది. పుట్టగొడుగులు వాడిపోతే ఈగలు వాలుతాయి. అన్ని పుట్టగొడుగులు ఒకే లాగ వుండవు. కొన్ని విషపూరిత

వాసనలు వొదులుతాయి. అట్టి విషపూరిత గాలిని పీల్చిన యెడల మనిషి ఆరోగ్యం చెడిపోతుంది”.

“ప్రత్యేకంగా చేయి ఆకారంలో మొలిచే ఆ పుట్టగొడుగు సంతతి విష వాయువును వదులుతుంది. దానిని మనం పీల్చరాదు. ఈ విషయాన్ని విడమర్చి చెప్పక మన వాళ్లు, అది ఓ దేవుడని, దయ్యమని చెప్పి దాని దరిదాపులోకి పోకుండా చేస్తారు”. అన్నాడు మళ్లీ తానే టీచర్.

“సార్ మరి పండగ చేస్తే ఏంకావటం లేదు కదా”.

“ఏం కాదు. పండగ పేరుమీద దానిమీద పసుపు చల్లుతారు. కుంకుమ చల్లుతారు. నిమ్మకాయలను కోసివేస్తారు, సాంబ్రాణి పొగవేస్తారు. అది ఎవరికంట పడకుండ ఓ కొత్త గంపకప్పుతారు. ఆ తరువాత అదినశిస్తుంది. దానితోపాటు దాని చెడు లక్షణాలు నశిస్తాయి.” పిల్లలు చేతులు కట్టుకుని శ్రద్ధగ వింటున్నారు.

“ఆ ప్రాంతంలో మళ్లీ మొలిచే అవకాశం వుంది. కనుక గుడికట్టి అప్పుడప్పుడు పసుపు, కుంకుమ చల్లుతు వుంటారు. ఏటేట పండగ చేస్తువుంటారు అది సంగతి”. విద్యార్థులు కొత్త విషయం తెలుసుకున్నట్టు ఊపిరి పీల్చారు.

“చెప్పొచ్చేదేమిటి అంటే ఉప్పలమ్మ లేదు. అది దేవుడు కాదు. అదొక రకమైన పుట్టగొడుగె” అప్పుడే అటువైపు వచ్చిన యాదగిరి తండ్రి పంతులు చెపుతున్న ఆకరిమాటవిని -

“మరి అది మొలిచినపుడు దానిని ముట్టుకున్నోళ్లు అక్కడికక్కడే రక్తం కక్కి సచ్చినోళ్ల సంగతి” అన్నాడు.

“అట్లా ఎవరన్న చచ్చారా ?”

“ఎందుకు సావలేదు. మావూరిలో గూడ మస్తుగ సచ్చిండ్రు. అందుకే పండగసేయడం” అన్నాడు గిరి తండ్రి.

“నేను ఇంతకుముందే మీరు రాకముందే చెప్పాను అది ఓ

విధమైన విషపుసూక్ష్మక్రిములను వొదులుతుంది. దానిని పీల్చితే మీరు చెప్పినవి సంభవించవచ్చు". అన్నాడు మళ్లీ.

"అంటే దానిగాలిలో అంత విషం వుంటదా సారూ" అన్నాడు గిరి తండ్రి.

"మల్లె చెట్టు మంచి వాసన వెదజల్లినట్టు, పుట్టగొడుగులు కొన్ని చెడువాసన వెదజల్లుతువుంటాయి. మరికొన్ని రకాల పుట్టగొడుగులను మనం తింటాం. మరి యిప్పుడు వాటిపెంపకం ఓ పరిశ్రమగ మారింది" అన్నాడు.

అట్లనా అన్నట్టు ఒకరినొకరు చూసుకుంటు అక్కడినుండి కదిలారు.

తెలియకముందు అంతా నలుపు.

తెల్సినంక అదే తెలుపు.

మనిషి చేయవల్సిందల్లా తెలుసుకునే ప్రయత్నం చేయాలి. అందుకు చదువుకోవాలి మరి !



# ఉపకారం




టీచర్ అటెండెన్స్ తీసుకుని రిజిష్టర్ పక్కన పెట్టాడు. తెలుగు వాచకాన్ని తీసుకుని ఆ రోజు చెప్పవల్సిన పాఠాన్ని తెరిచేటప్పుడు -

"సర్" అన్న మాటను విని, "యస్" అన్నాడేకాని తలెత్తి చూడలేదు. ప్రసాద్ అలాగే నిలుచుండి "రావచ్చా సార్" అన్నాడు.

"లేట్ రావటం ఓటి, రావచ్చా అనటం ఓటి, రా" అన్నాడు విసుక్కుంటూనే. -

ప్రసాద్ బిక్కుబిక్కుమంటు లోపలికొచ్చి, తాను రోజు కూర్చునే చోటుకువెళ్ళి కూర్చుంటాడు.

టీచర్ అటువైపు చూస్తూ - "ఎంర లోపలికి రమ్మన్నానే కాని కూర్చోమన్నానా ?" అన్నాడు కటువుగ.

ప్రసాద్ దిగ్గున లేచి నిలుచున్నాడు. ఎదమీద పుస్తకాలు అట్లాగే వున్నాయి.

"లేటుగ క్లాసుకు వస్తే శిక్షేమిటో తెలుసుగ" తెలుసు అన్నట్లు తలాడించాడు.

పిల్లలందరు అతనివైపే చేస్తువున్నారు.

"హు" అన్నాడు టీచర్.

ప్రసాదు అట్లాగే నిలుచున్నాడు. పిల్లలు తమతమ చూపులను పక్కకు తిప్పుకున్నారు.

"ఎందుకు ఆలస్యంగ వచ్చావు"

ప్రసాదు చూపులను నేలకువేసి మాట్లాడలేదు.

"నిన్నేనోయ్ చెప్పు లేటుగ ఎందుకొచ్చావు".

ఈసారి ప్రసాదు టీచర్‌వైపు చూస్తూన్నాడేతప్ప నోరు విప్పలేదు.

"లేటుగ వస్తే బెంచిఎక్కవల్సి వుంటుందని తెలియదు ?"

'తెలుసు' అన్నట్టు తలవూపాడు.

"తెలిసి తప్పుచేయడం మరి నేరం. అందువల్లా ఈ పాఠం అయ్యేంతవరకు అలాగే నిలుచో, హు" అన్నాడు.

ప్రసాదు తోటి పిల్లలవైపు ఓసారి చూసి, నిలుచున్నాడు.

అప్పుడే క్లాసులను పర్యవేక్షించడానికి అటువైపు వచ్చిన ప్రధానోపాధ్యాయుడు క్లాసులోపలకు రాగానే పిల్లలందరు లేచినిలుచుంటారు. టీచర్ పాఠం చెప్పడం ఆపివేస్తాడు.

"సిడౌన్" అన్నాడు ప్రధానోపాధ్యాయుడు.

అందరు కూర్చుంటారు. ప్రసాదు కూర్చోలేదు. ప్రసాద్‌వైపు చూస్తూ - "ఇతను లేటుగ వచ్చాడా ?"

"అవును సార్" అన్నాడు టీచర్.

"ఎందుకు లేటుగ వచ్చాడట. చెప్పాడా ?"

"చెప్పడం లేదు. కనీసం కారణం చెప్పితేనైనా -" అనేలోపే

"ఎందుకు లేటుగవచ్చింది చెప్పలేకపోయావు" ప్రసాదు ఈసారి కూడ నోరు తెరవలేదు పోగ చూపులను నేలవైపు మళ్లించాడు.

"వీడు లేటుగవచ్చాడు. మీరు పనిష్మెంట్యిచ్చారు సరే కాని వీడు రేపు గొప్పవాడౌతాడండి" అన్నాడు ఏదో తృప్తిగ. టీచర్ నవ్వలేక నవ్వును తెచ్చిపెట్టుకున్నాడు.

పిల్లలు అదోమాదిరిగ తమ చూపులను అటు ప్రసాద్వైపు యిటు ప్రధానోపాధ్యాయుని వైపు మార్చి మార్చి చూస్తున్నారు.

"వీడు ఎందుకు లేటుగ వచ్చాడో నేను చెపుతాను. ఓ ఫంక్షన్హాల్లో జరిగే పెళ్లి భోజనాల దగ్గర్కి ఓ అడుక్కుతినే గుడ్డివాడిని చౌరస్తాను దాటించడంతో ఆలస్యం జరిగింది. అదీ విషయం"

"ఎంత అడిగినా విషయం చెప్పలేదండి" టీచర్ అన్నాడు.

"అదే వానిలోని సుగుణం. చేసిన మంచిపని చెప్పలేదు. పైగ తాను శిక్ష అనుభవిస్తున్నాడు". ముందే చెపితే బాగుండేదికదర అన్నట్టు చూశాడు క్లాసు టీచర్ ప్రసాదును.

"పాఠం కానియ్యండి, వస్తా" అంటు ప్రధానోపాధ్యాయుడు బయటికి నడిచాడు.

"ఒరే ప్రసాదు, పేరుకు తగ్గమనిషివిర, ఇక కూర్చో" అంటు పుస్తకాన్ని తెరిచాడు టీచర్.

# ఈర్ష్య



అది భోజన విరామ సమయం. టీచర్స్ తమతమ ఇళ్లకు వెళ్లారు. వాళ్లతో పాటు కొందరు విద్యార్థులు వెళ్లారు. మరికొందరు విద్యార్థులు స్కూల్ ఎదురుగ వున్న వేపచెట్టు కింద నిలుచున్నారు. కిషన్ తన స్కూల్‌బ్యాగ్‌లోనుండి ఓ ప్లాస్టిక్ సంచిని తీసాడు. అందులో వున్న నాలుగు లడ్డూలలోను ఒకటి తాను తీసుకున్నాడు. మిగతామూడు, జానికొకటిచ్చాడు. శర్మకొకటిచ్చాడు, ఆఖరిది స్వామి కిచ్చాడు. నలుగురు లడ్డూలను తింటువున్నారు.

కిషన్ తన లడ్డును పూర్తిచేసి -

"మీరు నా స్నేహితులు, నాకో పనిచేసి పెట్టాలి" అన్నాడు.

"ఏంపని?" అడిగాడు జాని.

"మీరు చేస్తం అంటే చెపుత -"

చెప్పు అన్నట్టు చూశారు మిగతా ముగ్గురు.

"సాయంత్రం బడివొదిలినంక వీరయ్యను పట్టుకొని కొట్టాలే" ముగ్గురివైపు చూస్తు గుసగుసగా అన్నాడు. ముగ్గురు ఆశ్చర్యంగా విన్నారు. ఇందుకా లడ్డూలు తినిపించింది అనుకున్నారు లోలోపల.

"వీరయ్య మంచివాడు కదర" జాని అన్నాడు.

"ఎవరి జోలికి కూడపోడు" స్వామి చెప్పాడు.

"వాన్ని కొట్టాలి అంతే" కిషన్ ఆవేశంగా అన్నాడు.

"మంచివాన్ని కొడితే మనలను చెడ్డవాళ్లు అంటారు సుమా" అన్నాడు శర్మ.

"మీలో ఒకరు పట్టుకుంటే చాలు నేను కొడత" కిషన్ నిశ్చయంగా నేలవైపు చూస్తూ అన్నాడు.

"నీవో, మేమోకాని, వాన్ని కొట్టడం దేనికి" అడిగాడు జాని.

"వానికి ఎచ్చులు ఎక్కువ అయినయి" కిషన్ అన్నాడు.

"కానీ, మనకేం నష్టం" అన్నాడు శర్మ.

"ఫిఫ్త్, సిక్త్‌లో నేను ఫస్టా, వాడు ఈ ఆరునెల్ల పరీక్షలో ఫస్ట్ వచ్చి నన్ను లెక్కచేయటం లేదు" అని తన అక్కసును కక్కేశాడు.

అది విన్న ముగ్గురు మనస్సుల్లో వీరయ్య కదిలాడు. "కష్టపడి చదువుతాడు" అనుకున్నాడు శర్మ. "పుస్తకాలుకూడ కొనుక్కోలేని పేదవాడు" అనుకున్నాడు జాని. "క్లాసులో కాని బయటకాని ఎవరిజోలికి పోయెటోడు కాదు" అనుకున్నాడు స్వామి.

"మీకు గూడ వాడంటేనే యిష్టమున్నట్టుంది. మీరు రాకున్న బడివొదిలినంకా నేనొక్కన్నే వాని పనిపడతలే" అంటూ కోపంగ అక్కడినుండి వెళ్లిపోయాడు.

"ఒరే జాని ఈ విషయం మన క్లాసు టీచర్‌కు ముందే చెప్పిరార" అన్నాడు శర్మ కిషన్ అక్కడినుండి వెళ్లిపోయినంక.

"అవునా చెప్పరా" అన్నాడు స్వామి, శర్మ మాటలో మాటకలుపుతు.

ఆ తరువాత జాని టీచర్‌వైపు పోగ స్వామి, శర్మ క్లాసువైపు నడిచారు. క్లాసులో వీరయ్య ఏవో లెక్కలు చేసుకుంటు వున్నాడు. బెల్ అయింది. బయట వున్న పిల్లలందరు క్లాసుల్లోకి వచ్చారు. వాళ్లవెనకాల్నే డస్టర్, చాక్‌పీసులతో టీచర్లు క్లాసుల్లోకి వొచ్చారు. తమ టీచర్ క్లాసులోకి వచ్చేసరికి కిషన్ క్లాసులో లేడు.

అప్పుడే లోపలికి వస్తువున్నాడు. కిషన్ మౌనంగ చూస్తు వచ్చి క్లాసులో కూర్చున్నాడు. శర్మ, జానివైపు, స్వామి వైపు చూపును మార్చి మార్చి చూస్తున్నాడు.

"ఒరే పిల్లలు ఈరోజు మీకొక కథ చెపుతాను -" అనగానే అందరు ఉత్సాహంగ చూస్తువున్నారు.

"మనిషికి ధనంవున్నా వానిమీద ఈర్ష్య పడతారు. పదవి వున్న వానిమీద ఈర్ష్య పడతారు". ఎవ్వరికైన ఈ రెండు కావాలంటే అంత సులభంగా రావు. కాని మనిషి తనకంటే తెలివైన వానిమీద ఈర్ష్య పడితే ఏంలాభం ? ఒక మనిషి తలచుకుంటే శ్రమ, శ్రద్ధలో ఎదుటివాని కంటే ఎక్కువ తెలివిని సంపాదించవచ్చు. ఉదాహరణకు వీరయ్య తొంభై మార్కులు తెచ్చుకుంటే ఇంకా కష్టపడి శ్రద్ధతో చదివితే కిషన్ తొంభైఐదు మార్కులు సంపాదించవచ్చు. అంతేకాని వీరయ్య మీద కిషన్ గాని, జాని గాని, శర్మగాని ఈర్ష్య పడనక్కరలేదు. ఈర్ష్య మనుషుల మధ్య పరాయితనాన్ని పెంచుతుంది" అనగానే

కిషన్‌కు చెంపనకొట్టినట్లయింది.

ఏదో తప్పుచేసినట్టు చూపుల్లో మార్పువచ్చింది.

అవును అనవసరంగా వీరయ్యను కొట్టాలి అనుకున్నందుకు సిగ్గుపడ్డాడు.

ఈలోపు టీచర్ "కాబట్టి ఎవ్వరు గూడ ఎప్పుడు గూడ చెడును తలపెట్టవద్దు" అని కూర్చుంది.

వీరయ్యను కొట్టాలనుకున్న కిషన్ నిర్ణయం, ముందే టీచర్‌ను చేరిందన్నమాట. రహస్యమైనప్పుడు నలుగురి మధ్య దాగుతుందా ? దాగదు. తన తెలివి తక్కువ ఆలోచనకు సిగ్గుపడ్డాడు. వీరయ్య టీచర్ చెప్పిన నాలుగు మాటలను మరి మరి తలుచుకుంటున్నపుడు అతని ముఖాన చిరునవ్వు కదిలింది.

ఒకర్ని కొట్టే హక్కు మరొకరికి ఎక్కడిదీ ?

# ఆట



సాయంత్రం బడివొదిలారు. పిల్లలు కొందరు ఇండ్లకు వెళ్లారు. కొందరు పక్కగ్రౌండ్‌లో ఆడుకుంటున్నారు. పుట్-బాల్ తరహా బంతిని ఆడుతున్న వాళ్లను చూస్తు నిలుచున్నాడు శీను. కిటికిలో నుండి చూచిన టీచర్ శీనును పిలిచాడు. శీను కిటికి దగ్గరికి వెళ్లి నిలుచున్నాడు.

"ఏమి నీవు ఆడడం లేదు. అందరు ఆడుతున్నారు" అని అడిగాడు.

"వాళ్లతో ఆడొద్దన్నారు సార్"

"ఎందుకట?"

శీను గోళ్లు గిల్లుకుంటు నిలుచున్నాడు.

"వరె, గోళ్లు గిల్లొద్దని నీకు ఇదివరకు ఓసారి చెప్పినట్టు గుర్తు"

అవును అన్నట్టు తలాడించాడు.

"ఆజేబులోనిది ఏమిటి ?"

"బంతిసార్"

"నీ దగ్గర బంతి వుంది. ఇద్దరు ముగ్గురు కలిసి దాంతో ఆడుకోవచ్చుగా"

అవును అన్నట్లు చూశాడు.

"మరి ఎందుకు ఆడడంలేదు"

"ఎవ్వరు రావటంలేదు సార్"

"అట్లాగ" అంటు ఎందుకని ఆలోచనల్లోకి వెళ్లాడు.

"నీవు ఈ బాల్ ఎప్పుడు కొన్నావు"

"వారం రోజులైంది" జారుతున్న నిక్కర్‌ను పైకి లాక్కుంటు అన్నాడు.

"వారం రోజులనుండి వాళ్లెవరు ఆ బాల్‌తో ఆడుకోలేదా ?"

ఈసారి శీను తలవంచుకున్నాడు.

"చెప్పవేంరా" టీచర్ కాస్త గట్టిగ అన్నాడు.

"నా బంతిని నేను ఎవర్కి ఇవ్వటంలేదు సార్"

"అదీ కథ"

"వాళ్లు ఆడుకుందాం అనివచ్చారా ?" కిటికి సువ్వలను పట్టుకొని అడిగాడు.

వచ్చారు అన్నట్లు తలాడించాడు.

"అప్పుడు వాళ్లకు బాల్‌లేదు, నీ బాల్‌తో ఆడుకుందాం అన్నానువ్వు ఇవ్వలేదు. వాళ్ళే నలుగురు కలిసి నీకంటే పెద్దబాల్‌కొనుక్కున్నారు. అందరు కలిసి ఆడుతున్నారు. ఇప్పుడు నిన్ను వాళ్లు రానివ్వటం లేదు. అంతేనా ?"

"అవును సార్"

"తప్పురా, తప్పు. ఆట అంటే నలుగురు కలిసి ఆడుకుంటేనే ఆనందం. నీకు బాలున్న వంటరివి. కాసేపు గోడకో, నేలకో కొట్టి ఇంటికిపోతావు అంతేనా ? అది ఆటకిందికి రాదు", శీను తలెత్తి శ్రద్ధగ వింటున్నాడు.

"చూడు మనం ఒకరికిస్తే మనకు ఎదుటివాడు తిరిగిస్తాడు. అది సహకారమే కావొచ్చు, ప్రేమే కావొచ్చు. ఇచ్చి పుచ్చుకోవడం లోనే స్నేహం పెరుగుతుంది. మాట, ఆట మనుషులను దగ్గరికి చేరుస్తుంది."

ఈసారి శ్రీను ముఖం విప్పారినట్లయింది. అంతవరకు తాను అనుభవిస్తున్న సంకుచితభావం పటాపంచలైంది.

"నేను వాళ్లను పిలిచి చెపుతాను వాళ్లతో కాసేపు ఆడుకో" అని చప్పట్లు కొట్టి సతీష్‌ను పిలిచాడు. టీచర్ చప్పట్లు విని అందరు ఆడడం ఆపి కిటికివైపు చూశారు.

'రండి' అన్నట్లు కిటికిలోనుండి చేయి ఊపాడు. అందరు కిటికి దగ్గర్కి వొచ్చి నిలుచున్నారు. సతీష్ చేతిలో బాలుంది.

"ఈ బాల్ ఎప్పుడు కొన్నారు."

"ఈరోజే సార్"

"ఏమాట ఆడుతున్నారు"

"ఏదో వుత్తుత్త ఫుడ్‌బాలాట" అన్నాడు సతీష్.

"అచ్చా, మరి శ్రీను మీతో ఎందుకు ఆడడం లేదు"

"ఆయన మాతో ఆడడు సార్"

"మీరు పిలిచారా."

"నిన్న మొన్న ఆయన దగ్గర బాలుండె సార్, మమ్ముల ఎవ్వర్ని ఆడనివ్వలేదు. ఇక మేమే నలుగురం కలిసి -"

"ఈ బాల్‌కొన్నారు. మీరు అతన్ని ఆడనివ్వడంలేదు. వాడుచేసిన పొరపాటే మీరు చేస్తువున్నారు. అవన్నీ మరిచిపోయి శ్రీనును మీతో ఆడనివ్వండి" అన్నాడు టీచర్.

అందరు మౌనంగ నిలుచున్నారు.

"వెళ్ళండి అందరు కలిసి ఆడుకోండి. మీ బాల్‌తో ఫుడ్‌బాల్ ఆట ఆడితే వాని బాల్‌తో వాలిబాల్ ఆట ఆడండి, సరేనా".

"వాడు బాల్ ---" ఇవ్వడు అన్నట్లు చూశారు.

"యిస్తాడు, శ్రీను నీ బాల్ యివ్వు అనగానే శ్రీను తనబాల్ సతీష్‌కిచ్చాడు. అందరు గ్రౌండ్‌లోకి నడిచారు.

అందరు కల్సి ఆడితేనే అదో ఆనందం.

●

# గోలీలాట



"నా దగ్గర గోలీలున్నాయి" అన్నాడు రవి తన పిడికిల్లో సీసపు గోలీలను పట్టుకొని.

"నా దగ్గర వున్నాయి" అన్నాడు శంకర్ తన నిక్కర్ జేబును చూపిస్తు. జేబు ఉబ్బి వుంది.

"ఆడుకుందామా"

"ఓ" అంటు జేబులోని గోలీలను చేతిలోకి తీసుకున్నాడు శంకర్.

ఓ పదునైన రాయిని తీసుకుని నేలను పొక్కిలిచేసి, మట్టిని తోడి గుంటను చేశాడు రవి.

శంకర్ గుంటకు కొంత దూరాన, గీతలు గీసి, అక్కడనిల్చుని గోలీని గుంటలోకి విసిరాడు.

అలాగే రవికూడ విసిరాడు. ఆ తరువాత గురిచూసి చుట్టువున్న గోలీలను వేలితో చిమ్మాడు. రవి టకటక శంకర్ గోలీలను కొట్టి అన్నిటిని గెల్చుకున్నాడు.

శంకర్ ఓడిపోయినట్టుగ నిలుచున్నాడు. తన గోలీలన్ని వడిసిపోయాయి కనుక యిక తను ఆడలేదు.

రవి గెల్చుకున్న గోలీలను జేబుల్లో నింపుకొని విజేతలాగ నవ్వుతు నిలుచున్నాడు.

"నాకు నాలుగు గోలీలు అప్పుగ యివ్వు. నేను మళ్లీ ఆడి ఆ తరువాత నీ అప్పు తీర్చుతాను". అన్నాడు శంకర్.

"అమ్మో నేను అప్పిస్తే, నీవు ఆడి నా గోలీలను అన్నిటిని గెలుచుకుంటే" అన్నాడు రవి అనుమానంగా.

చీకటి పడింది. ఇద్దరు తమ ఇళ్లకు చేరుకున్నారు.

"నేను యివ్వను" అన్నాడు రవి రాత్రి నిద్రలో.

"ఇవ్వనంటే యివ్వను" మళ్లీ అన్నాడు.

"నా బొక్క యిడవర" ఈసారి ఉద్రేకంగా అన్నాడు.

"రవి, ఒరె రవి" అంటు చేత్తో కదుపుతు పిలిచాడు తండ్రి.

"ఒదులు, ఒదులుర" అంటు అటు యిటు కదిలాడు.

"దేన్నిర ఒదిలేది. లే, లేచి కూర్చో" అన్నాడు తండ్రి.

రవి కళ్లు తెరిచి అటు యిటు చూస్తూ లేచి కూర్చున్నాడు.

"ఏంనాన్న ఎందుకట్ల కలవరిస్తున్నావు" అన్నాడు తండ్రి.

తండ్రి ముఖంలోకి అదోమాదిరి చూసి తలదించుకున్నాడు రవి.

"పడుకో మంచినీళ్లు తాగుతావా ?" అని అడిగాడు.

వద్దన్నట్టు తల ఆడించాడు రవి. కాని అతనిలో ఏదో ఆందోళన కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. నుదిటిమీద చెమట బిందువులు చేరినయి.

"ఎందుకట్ల కలతగ వున్నావు"

ఏమి లేదన్నట్టు తలాడించాడు అమాయకంగా.

"అయితే పడుకో" అంటు కాళ్లమీది చద్దర్‌ను ఎదమీదికి గుంజబోయాడు. అప్పుడు నిక్కర్‌జేబి దగ్గర చేతికి ఏవో గట్టిగ

తగిలాయి. రెండవవైపు తడిమి చూశాడు. ఆ జేబు గట్టిగానే తగిలింది. వాటిని తడిమి తడిమి చూస్తు "ఎక్కడివిరా యిన్ని గోలీలు. పొద్దంత వాటితో ఆడడమేనా" అన్నాడు.

"ఎన్ని పైసలు తగలేసి కొన్నావు" అన్నాడు మళ్లీతానే.

రవి 'వాటిని కొనలేదు' అన్నట్టు తలనుకదిలించాడు.

"మరెక్కడివి?"

"గెల్చినయి"

"అవన్ని గెల్చినయెనా"

"హు" అన్నాడు

"ఆటలు ఆడాలి. కాని పొద్దంతా కాదు. ఎప్పుడో ఓసారి ఆడాలి. ఈలాంటి ఆటల్లోగెలుచుకున్న గోలీలు, ఆట ముగిసినాక ఎవరివి వారికి యిచ్చేయాలి".

"హు గెల్చినంక ఎందుకియ్యాలె" అని అయిష్టంగా పక్కమీదికి వొత్తిగిల్లి పడుకున్నాడు.

"యిస్తేమంచిది. ఏ ఆటలోనైన గెలుపు ముఖ్యమేకాని వస్తువుకాదు" భుజం మీద చేయివుంచుతూ అన్నాడు.

"గెలుచుకున్నంక ఎవ్వరు యివ్వరు".

"నీవైతె యిస్తూ వుండు. నిన్నుచూచి మిగతావాళ్లు కూడ యిస్తారు."

రవి మౌనంగా చూస్తువుండి పోయాడు".

"ఇంతకుముందు యివ్వను, యివ్వను అని కలువరించావు గోలికాయలేనా ?" అంటు అడిగాడు.

"శంకర్‌తో ఆడి గెల్చిన, మళ్లి ఆడుదాం కొన్ని అప్పుగ యివ్వమన్నాడు".

"ఇవ్వ వలిసింది"

రవి మాట్లాడలేదు.

"ఏ ఆటలోనైనా గెలిచేనైపుణ్యాన్ని సంపాదించడం గొప్ప కాని, ఎదుటివాళ్ల వస్తువునుకోరకూడదు."

రవి తండ్రి ముఖంలోకి చూస్తు వింటు వున్నాడు.

ఆటను ఆటగ ఆడి ఆనందించాలికాని జూదంగ మార్చకూడదు. కలతలను తెస్తుంది. అప్పుడు మనిషి నిద్రకుదూరమౌతాడు. రేపు శంకర్ గోలీలు శంకరికిచ్చేయ్. ఇక నీవు హాయిగ నిద్రపో" అంటు చద్దర్ మెడలవరకు కప్పి, తాను పక్కమ్మటే పడుకున్నాడు.

"వాని గోలీలు వానికి రేపు ఇచ్చెయ్యాలె" అనుకుంటు రవి ప్రశాంతంగ నిద్రలోకి జారుకున్నాడు.



# కట్నం కావాలా ?



ఇద్దరు అమ్మాయిలు లోపలికి రావడం చూసిన యస్.ఐ. "ఏం కావాలట?" అని ప్రశ్నించాడు.

"ఏదో దరఖాస్తు యివ్వడానికి వొచ్చారటసార్" అన్నాడు మెట్ల దగ్గర నిలుచున్న కాపల పోలీస్ జవాన్.

"ఏం దరఖాస్తు?" తన టేబుల్ దగ్గరి నిలుచున్న వాళ్లవైపు చూస్తు అన్నాడు.

ఇద్దరిలో జయ తన దగ్గరవున్న దరఖాస్తు యస్.ఐ.కి అందించింది. అందుకున్న దరఖాస్తులో -

"ఆర్యా!

రెండు నెలల కింద మా అక్క సీత పెళ్లి అయ్యింది. అప్పటినుండి ఆ వూళ్ళోనే వున్నది. మొన్న మా బావ అక్కను తీసుకొచ్చి మా యింటి దగ్గర వొదిలిపెట్టినాడు".

అంతవరకు బయటకు చదివి మిగతాది వినపడకుండా చదివి, ఆ తరువాత ఆఖరి లైన్స్ తిరిగి బయటికి వినపడేట్టు చదివాడు -

"పోతు పోతు అక్కమీద బంగారం గుంజుకొని పోయాడు.

కావున ఆయన మీద తగుచర్య తీసుకోవల్సిందిగ ప్రార్థన".

తేది : 01.11.1997 ఎ. జయ

దరఖాస్తును పూర్తిగ చదివిన యస్.ఐ. పిల్లల వైపు చూస్తు "ఈ అమ్మాయి ఎవరు" అన్నాడు.

"ఈమె నా ఫ్రెండ్‌సార్. పేరు కమల" అంటు చేతులు కట్టుకుని నిలుచుంది.

కమల చేతులు కట్టుకుని నిలుచుంది.

ఆ ఇద్దరిని చూస్తుంటే యస్.ఐ.కి ముచ్చటేసింది. 'చూడడానికి చిన్నవాళ్లైన చేపట్టిన కార్యం పెద్దది' అనుకుంటు "చెప్పండి ఈయన మీద ఏం చర్య తీసుకొమ్మంటారు".

"వాన్ని స్టేషన్‌కు పట్టుకొచ్చి సార్" జయ.

"పట్టుకొచ్చి"

"బాగకొట్టాలిసార్. వాని వంటిమీద గూడ వాతలు రావాలిసార్"

"అయినా కట్నం అడగడం, తేకుంటే కొట్టడం నేరం కదా సార్" అన్నది కమల.

"నేరమే" యస్.ఐ. చెప్పాడు.

"నేరస్తుల్ని శిక్షించాలికదా సార్" అన్నది జయ.

"వానిది చౌటుప్పల అంటున్నారు. అది నా పరిధిలోకి రాదే"

మరెట్లా అన్నట్టు ఒకరిముఖం వొకరు చూసుకున్నారు.

"ఆ పోలీసు స్టేషన్‌లో దరఖాస్తు యివ్వవల్సి వుంటుంది. మీ నాన్నగారు వెళ్లి అక్కడ ఇస్తే బాగుంటుంది"

"మా అమ్మ నాన్న అక్కను కొట్టిన దెబ్బలను చూసి ఏడుస్తు కూర్చున్నారు సార్".

"ఓ చెడును అరికట్టడానికి ఇంత చిన్నవాళ్లైనా మీ ప్రయత్నాలు మెచ్చుకోతగ్గవి. నేను ప్రయత్నం చేస్తాను" అంటు

టెలిఫోన్ దగ్గర్కి లాక్కుని, నెంబర్ తిప్పి -

"హలో చౌటుప్పల్ స్టేషనా మాట్లాడేది, యస్.ఐ. గారేనా ?"

"మాట్లాడుతున్న"

"గుడ్‌మార్నింగ్ బ్రదర్, నేను చిట్యాల యస్.ఐని"

"మార్నింగ్ మార్నింగ్, చెప్పండి"

"చింతకింది రాములు, బంగారుగడ్డ, ఆటోనడుపుతాడట. రెండు నెలల క్రితం పెళ్లైంది. భార్యను రోజు కొడతాడట."

"ఎందుకని?"

"ఇంకేముంది. కట్నం డబ్బులు పూర్తిగ తేలేదని ఆఖరికి మొన్న తీసుకొచ్చి యిక్కడ తల్లితండ్రి దగ్గర వొదిలి వెళ్లాడు. వాన్ని కాస్త -"

"బొక్కలో తోయమంటావు. మక్కలిరుగతన్న మంటావు. ఆ ఒకే"

"దరఖాస్తును మీకు పంపిస్తాను".

"సరె, పంపండి" అంటు టెలిఫోన్ పెట్టేసిన శబ్దం.

"నేను చూసుకుంట వెళ్లండి".

"థాంక్స్ సార్" అని నమస్కరించి అక్కడినుండి కదిలారు.

రోడ్డెక్కి బడివైపు నడుస్తు -

"జయ ! పోలీసోల్లు వాన్ని కొడతారనుకో ఆ తరువాత వాడు మళ్లి అక్కను కొటడా ?"

"అక్కను వానింటికి తోలనే తోలము"

"అట్లా ఎట్లా కుదుర్తది" అనే లోపే బడికి దగ్గరైనారు. క్లాసులోకి నడిచారు.

కమల అన్నట్టె మూడవ రోజు చింతకింది రాములు తన అత్తగారింటికి వచ్చాడు.

ఆయనతో ఎవ్వరు మాట్లాడలేదు. భార్య బట్టలుతుకు

తుంది. అత్త అన్నం వండుతువుంది. మామ అప్పుడె బయటినుండి వచ్చేది చూసి ఎదురు వెళ్లి కడుపులో తలవుంచాడు. ఆయనకు ఏమీ అర్థంకాలేదు.

"తప్పైంది. నా భార్యను తీసుకుపోత" అన్నాడు.

మామ మాట్లాడలేదు.

'పోలీసువాళ్ల దెబ్బలు గుర్తురాగ' "నాకు బుద్ధివచ్చింది. నాకు యింక ఏమీ యివ్వొద్దు" అన్నాడు.

చప్పుడు విని అత్త బయటికొచ్చి నిలుచుంది.

ఈ మార్పు ఎట్లా వచ్చిందో అత్త, మామకు అర్థంకాలేదు.

"నన్ను నమ్ము నీ బిడ్డను కంటికి రెప్పలాగ చూసుకుంట"

"మళ్లి జరిగితె" అన్నాడు మామ.

'మళ్లి పోలీసు వాళ్ళు గుర్తు రాగ'

"అట్లా జరగనే జరుగదు" అంటూ తలుపు చాటుకు నిలుచోని వింటున్న భార్యవైపు చూశాడు.

మధ్యాన్న భోజనానికొచ్చి జయ, బయటి దర్వాజ దగ్గర నిలుచోని విని ముసిముసిగ నవ్వుతు లోపలికొచ్చింది.

అదిచూసి రాములు "మరదల నీవన్న చెప్పవే మీఅక్కకు" అన్నాడు.

"అక్క, బావ సంగతి నా కొదిలేయి. ఇక నీమీద పుల్ల విరిచివేస్తే అంత వొట్టు". అక్క దగ్గరికి వెళ్లి మెల్లగ చెపుతుంది. ఆమె చెల్లెని దగ్గర్కి తీసుకుని "మీ బావకు ఏం మంత్రం వేశావే" అంది.

"మంత్రం ఏమిలేదు. సన్మానం చేయించినంతే" అంటు లోపలికి నడిచింది.

రాములు తన భార్యవైపు చూస్తు 'మనింటికి పోదాం పద' అన్నట్టు కళ్ళతోనే సైగ చేశాడు.

●

# తూనీగలు



టీచర్ క్లాసురూమ్‌కువొస్తు తనముందు కుంటుతు నడిచే సూరి భుజం మీద చేయివేస్తూ.

"ఏంరా సూరి, కుంటుతున్నావేం" అని అడిగాడు.

సూరి తలపైకెత్తి "కాలికి ముల్లిరిగిందిసార్" అన్నాడు

"కంపనెందుకు తొక్కినవుర?"

సూరి మాట్లాడలేదు, టీచర్‌ముందు, సూరి వెనక క్లాసులోకి వెళ్లి కూర్చున్నాడు.

"సూరి కంపలో అడుగెందుకేశావో చెప్పనే లేదు." టీచర్

సూరి మౌనంగ నిలుచున్నాడు.

"నేను చెపుతాను సార్" అన్నాడు పక్క విద్యార్థి శివుడు.

సూరి శివునివైపు కోపంగ చూశాడు.

"చెప్పర, చెప్పు, నీవు చెప్పకపోయిన శివచెపుతాడట."

సూరి నోరు విప్పలేదు.

"చెప్పర శివ"

"నిన్న ఆటల పీరియడ్‌లో తూనీగలు పట్టకపోయి కంపలో అడుగేసిండు, స్లిప్పర్‌లోనుండి ముల్లు దిగబడింది సార్" అన్నాడు శివుడు.

అట్లనా అన్నట్టు చూశాడు టీచర్.

"తూనీగల పట్టద్దుర అంటె పడతడు సార్".

"హు" అంటు తలాడించాడు టీచర్.

"రోజు ఎన్నో తూనీగలను పట్టి రెక్కలు, తోకలు విరిచేస్తాడు సార్"

"చ్చొ, చ్చొ" అంటు ఓ మాదిరిగ సూరివైపు చూశాడు.

సూరి తలవంచుకుని నిబ్బరంగ చూస్తు నిలుచున్నాడు.

"ఏం రా సూరి, ఎందుకట్ల చేస్తావు" టీచర్ అడిగాడు.

క్లాసులో విద్యార్థులంత సూరినే చూస్తు వున్నారు.

"చెప్పర నీ ఉద్దేశ్యం ఏమిటి" టీచర్.

"మరి, మరి" సూరి ఏదో చెప్పబోయి ఆగాడు.

"హ, మరి" టీచర్

"నేనొక్కన్నే కాదు సార్. అందరు తూనీగలను పట్టుకుంటారు" సూరి గోళ్లు గిల్లుకుంటు చిన్నగ చెప్పాడు.

"మేం పట్టినా వాటి రెక్కలు, తోకలు ఇరువం తెలుసా" అన్నాడు శివ సూరివైపు, టీచర్‌వైపు చూపులను మార్చి మార్చి చూస్తు.

"సూరి, వీటినే కాదు సార్, సీతాకోక చిలుకలను పట్టుకుంటడు" అంటు అదనపు ఆరోపణ చేశాడు మరో విద్యార్థి కిషన్.

సూరి కిషన్‌వైపు గూడ కోపంగ చూశాడు.

"వున్న మాట అన్న, ఆయన జేబు చూస్తె తెలుస్తది సార్"

అన్నాడు కిషన్.

"ఏది, యిటు రా సూరి" అని పిలిచాడు టీచర్.

సూరి మౌనంగ టీచర్ దగ్గర్కినడిచి వచ్చి నిలుచున్నాడు.

"ఏది నీ జేబులో ఏమున్నది తీయ్" అన్నాడు టీచర్.

షర్ట్ జేబులో వున్నవి ఒక్కొక్కటే బయటికి తీసాడు. చిన్న పెన్సిల్ ముక్క, రబ్బర్, నాలుగు చింతగింజలు.

"ఆ జేబిలోకాదు సార్, నిక్కర్ జేబిలో" అన్నాడు కిషన్.

సూరి కిషన్ను కొట్టేటట్టు, నోట్లో నోట్లో ఏదో అంటు నిలుచున్నాడు.

"తీయర, తీయవేంరా" అంటు టీచర్ వంగి సూరి జేబిలోని అగ్గిపెట్టెను తీస్తాడు. దానెమ్మటె ఓ చిన్న నెమిలి ఈక బయటపడింది.

"నీకు అగ్గిపెట్టె ఎందుకుర" అంటు పెట్టెను తెరిచాడు. అందులో ఓ అందమైన సీతాకోకచిలుక వుంది.

"వొరె, ఎందుకుర దీనిని ఇందులో బంధించావు. ఇంక నయం చావలేదు" అంటు దానిని అరచేతిలో వుంచి, కిటికిదగ్గర్కి తీసుకెళ్లాడు. అది బయటికి లేచిపోయింది.

సూరి తన చేతలు బయటపడ్డందుకు బాధగ, భయంగ నిలుచున్నాడు.

"వెళ్లి కూర్చోఫో" టీచర్ అన్నాడు.

సూరి తన సీటు దగ్గర్కి వెళ్లి కూర్చున్నాడు.

"పిల్లలూ! మీరంత తూనీగలను, సీతాకోక చిలుకలను పట్టగూడదు. అవి చాల అందంగ వుంటాయి కనుక వాటి వెంట మీరు పడతారు అవునా ?" టీచర్.

అవును అన్నట్టు తలలాడించారు.

“అందమైన వాటిని చూసి ఆనందించాలి. అంతే ముట్టకూడదు. తోటలో రంగు రంగుల పూలు అందంగానే వుంటాయి. వాటి అన్నిటిని మనం తెంపుతామా? అవి రాలినంక ఏరుకోవటం వేరు.

పోతే కందిరీగలు, తేనేటీగల జోలికి వెడతారా ? వెళ్లరు. ఎందుచేత అవి మిమ్ములను కుడతై కాబట్టి.

పిల్లలు ! కుట్టినా, కుట్టకపోయినా వాటి జోలికి మీరు వెళ్లవద్దు. వాటిని అసలె పట్టవద్దు. చంపవద్దు. అవి నోరులేని అమాయక ప్రాణులు. వాటిని హింసించకూడదు. ఇకనుండి వాటి జోలికి వెళ్లకండి. ఏ ప్రాణి మరొక ప్రాణిని హింసించరాదు. ముఖ్యంగ మంచిచెడు తెలిసిన మనం హింసచేయగూడదు అంటు అటెండెన్స్ రిజిష్టర్ తెరిచాడు.



# చదువు కావాలి



"చదువొద్దు గిదువద్దు" తండ్రి సాయన్న అన్నాడు.

తలవంచుకుని నిలుచున్నది పదేండ్ల కూతురు వసంత.

"దీని పెండ్లి చేస్తే" పందిట్లో నిలుచోని అన్నాడు.

"నా పని అయిపోతది" తలుపుచాటునుండి తల్లి అన్నది.

"అంతే కదా" తండ్రి. అన్నాడు.

"చిన్న పిల్లే కద, ఇంకా చదవనీ" తల్లి చెప్పింది.

"సదివింది సాలు. ఉద్యోగం సేసేదుందా, ఊళ్లేలేదుందా" తండ్రి అన్నాడు.

"ఇప్పుడె ఎట్లచెపుతం, సొంతం చదివితె దానికి దగ్గది దానికి దొరకదా" తల్లి అన్నది.

"దొరకదు, సదవద్దు. పెండ్లి చేద్దా అంతే"

తల్లి మాట్లాడలేకపోయింది. కూతురు వైపు చూసింది.

తలవంచుకుని నిలుచున్న వసంత కళ్లనుండి కన్నీటి చుక్కలు కిందరాలాయి. అది చూసి తల్లి దుఃఖితురాలైంది. తమ పేదరికం మీద తానే ఈసడించుకుంది.

"నా మాటకు తిరుగులేదు. అంతే" అంటు బయటికి నడిచాడు.

పొద్దు పొడిచి బారెడెక్కింది.

సాయన్న యింటిచుట్టు ఆ వూరి బడిపిల్లలు కూర్చున్నారు.

"ఏందిదంత" సాయన్నచిరాకు పడ్డాడు.

ఎవరు చప్పుడు చేయలేదు. అప్పటివరకు వసంత ఇంట్లోనేవున్నది. తండ్రి లోపలవైపు చూస్తు "ఏమే ఏమెరగనట్టు ఇంట్ల వుండి ఈ కోతుల దండును బయటుంచినవా" అన్నాడు.

వసంత చప్పుడు చేయలేదు.

ఆ మాటవిన్న బయటి పిల్లలు చప్పుడు చేయలేదు.

"జరగండి నేను పనిమీద పోవాలె"

పందిరికింద పిల్లలు మౌనంగా కూర్చున్నారు.

"ఇదేమిటి"

ఎవ్వరు చప్పుడు చేయలేదు.

"ఈ కఱ్ఱతో మిమ్ములను కొడతను జాగ్రత్త" అంటు చేతిలోకి కఱ్ఱను తీసుకున్నాడు.

అందరు ఒకేసారి లేచారు.

సాయన్నకు ఒక్కసారే వళ్లు జలదరించినట్లైంది.

రెప్పపాటున ఒకరికొకరు సైగ చేసుకుని అందరు వరుసగ వంగుతు కొట్టమన్నట్టు చూశారు.

ఈసారి సాయన్న బిత్తరపోయాడు.

అందరు ఒకేసారి "వసంతను బడికి పంపాలి" అన్నారు.

సాయన్నకు ఎటు తోచలేదు.

మళ్లి అదేమాట "వసంతను బడికి పంపాలి" అన్నారు.

సాయన్న వసంత వైపు కోపంగ చూశాడు. వసంత తల్లిపై

పళ్లు కొరికాడు. "మళ్లి వసంతను బడికిపంపాలి" అనగానే పిల్లలవైపు చూశాడు.

"వసంత చాల క్లవరు. చదివించాలి".

"వరె పిల్లసన్నాసుల్లారా, ఈ ఏడు తరువాత, ఆ పైచదువు మన ఊళ్లో లేదే. అప్పుడైనా"

"పక్కూర్లో ఇంటర్‌వరకుంది".

మరి తిండి బట్ట అన్నట్టు కడుపును తాకుతు అన్నాడు.

"అన్ని అవె వస్తయి" అంటు వంగివున్న విద్యార్థులు నిలుచున్నారు.

"నాకైతే అర్థం కాలే"

"తిండి బట్టకు హాస్టల్ వున్నది. పుస్తకాలు ప్రభుత్వమే ఇస్తుంది".

సాయిలు నీళ్లు మింగుతు నిలుచున్నాడు.

"మీరు సరే అంటే మేం వెళ్లిపోతము. లేదంటే ఇక్కడెవుంటం"

"ఉండండి ఎన్ని రోజులుంటరో"

"ఎన్ని రోజులైన వుంటం".

'ఓరి పిడుగుల్లారా!. అంత అనుకొని కట్ట కట్టుకొనే వచ్చారన్నమాట' అనుకున్నాడు.

ఈలోపు అందరు చేతులు జోడించి "వసంతను బడికి పంపించాలి" అన్నారు.

వసంత వైపు, వసంత తల్లి వైపు కోపంగచూసి, పిల్లలవైపు కాస్త ప్రేమను నటించాడు. చేసేది లేక "సరె" అన్నాడు.

అందరు కలిసి వసంతను తీసుకుని వెళ్లిపోయారు.

తోవలో ఈ ప్లాన్ యిచ్చిన వసంత వాళ్ల క్లాస్‌టీచర్ కలిసి "శభాష్ సక్సెస్" అని దగ్గరవున్న వాళ్లతలలు నిమిరి, ఇకపదండి

అంటు స్కూల్ వైపు నడిచారు.

"ఐకమత్యం, మంచితనం, ఎంతటిపనినైనా చేయిస్తుంది" అన్నాడు టీచర్. అవును అనుకుంటు టీచర్ వెనకాల నడుస్తున్నారు.

"ఈ ఆయుధంతోనే గాంధీగారు తెల్లదొరలను గెలిచాడు" అన్నప్పుడు పిల్లల్లో ఏదో కొత్త వుత్సాహం కదిలింది. ఈ లోపు టీచర్ "ఇప్పటివాళ్లు చీటికిమాటికి, అయిందానికి కానిదానికి ఈ ఆయుధాన్ని ఉపయోగించి అరాచకాలను సృష్టిస్తున్నారు. అంతేకాదు వాళ్ల ప్రయోజనాలకోసం విద్యార్థులను గూడ ఊరేగింపులో దింపి అటు చదువును ఇటు నైతిక విలువలను చెడగొడుతువున్నారు. కాబట్టి మీ తరం పిల్లలు చాల జాగ్రత్తగ మంచి చెడులను గమనించి నడవాలి సుమా" అని అంటున్నప్పుడు శ్రద్ధగ వింటున్నారు పిల్లలు.



# రేగు పండ్లు



ఆ రోజు ఆదివారం. బడికి సెలవు.

స్వామి, శంకర్ ఇద్దరు పొద్దున్నే అడవికి వెళ్లారు. రేగు పండ్లు ఏరుకొచ్చి బండమీద పోశారు. పగటి భోజనం వేళ అయ్యింది. ఏరిన రేగు పండ్లను ఇద్దరు పంచుకోవడానికి బండమీద కూర్చున్నారు.

"శంకర్ నేను కొంచెం ఎక్కువ తీసుకుంటర"

"ఎందుకు"

"ఏరింది నేనుకదా"

"ఏరితే"

"ఏరేటప్పుడు వేళ్ళకు ఎన్ని ముండ్లు గుచ్చుకున్నా యనుకున్నావ్" స్వామి అన్నాడు.

"నాకు మాత్రం చేతులకు గుచ్చుకోలేదా. నీవు ఏరినంత సేపు నేను రేగుమండలను ఏరి పట్టుకోలేదా ?"

స్వామి పండ్లవైపే చూస్తు ఏదో ఆలోచిస్తున్నాడు.

"పండ్లని తొందరగ రాలాలని కట్టెతోటి చెట్టును కొట్టినప్పుడు రెండుసార్లు నా చొక్కాకు కంప తగిలింది తెలుసా"

"తగిలింది కాని చొక్క చినగలేదుగ"

"అంటే -" చొక్క చినగాలా అన్నట్టు చూశాడు శంకర్.

స్వామి మాట్లాకుండా ఏదో ఆలోచిస్తువున్నాడు.

"అత్యాశ మంచిదికాదు. పొద్దుటినుండి ఇద్దరం కష్టపడ్డాం చెరిసగం పంచుకుందాం"

"నాకు ఓ తమ్ముడున్నాడుర వానికి కొన్నిపెట్టాలె"

"నాకు ఓ చెల్లెవుంది గదర"

"చెల్లెకు పెట్టకున్న నడుస్తది"

"ఎందుకు చెల్లె పండ్లు తినదా"

స్వామి మాట్లాడలేదు.

"అందరం తింటాము. నీ వాటిల్లోనుండి నీవు తమ్మునికి పెట్టుకో. నేను నా వాటిల్లో నుండి నా చెల్లెకు పెట్టుకుంట. హు కాని, రెండు భాగాలు చెయ్యి".

"నీవే పంచు"

"అంటే పంచినవాళ్లు ఆఖర్న ఎత్తుకోవాలనా ?"

స్వామి నవ్వాడు. శంకర్ నవ్వుతూనే పండ్లను రెండు కుప్పలుగ పంచాడు.

"హు ఇగ ఎత్తుకో" అన్నాడు శంకర్.

స్వామి రెండు కుప్పలను పరిశీలనగ చూసి ఓ కుప్పను ఎత్తి జేబులో నింపుకున్నాడు.

మిగిలిన వాటిని శంకర్ ఎత్తుకున్నాడు. ఇద్దరు ఊరివైపు నడుస్తున్నారు.

ఊరి పక్కమ్మటే ఓ చింతచెట్టుంది. ఆ చింత చెట్టు కింద ఒక గుడ్డి ముసలమ్మ కూర్చొని వుంది. అక్కడికి కొంత దూరంలో ఇసుకలో పిల్లలు ఆడుకుంటున్నారు. వీళ్లరాకను శబ్దం ద్వారా గుర్తించిన ముసలమ్మ "ఎవరు, రేగు పండ్లకు పొయ్యొస్తున్నర" అంటు అడిగింది. స్వామి చప్పుడు చేయలేదు. శంకర్ "అవును అవ్వ" అన్నాడు.

"ఏది రెండు పెట్టిపోతాత" అంది.

స్వామి చప్పుడు చేయలేదు.

"పుల్లపుల్లగ వుంటాయి గద తినబుద్ధి అయితుంది. రెండు పెట్టి పాంట్రి" అంది.

శంకర్ తన జేబిలోనుండి కొన్ని తీసి ముసలమ్మ చేతిలో వుంచాడు.

"చాలు బిడ్డ, చాలు సల్లగ బతుకు" అంది.

శంకర్ వడివడిగ నడిచాడు స్వామిని కలిశాడు.

"నేను రెండు ఎక్కువ తీసుకుంట అంటె ఒప్పుకోలేదుకదా ?"

"అవును"

"మరి ముసలమ్మకు ఎందుకు పెట్టినవ్ అంటవ్ ?" అన్నాడు శంకర్. అవునన్నట్టు చూశాడు స్వామి.

"అరె ఆమె నడవలేదు. పోగ గుడ్డిది. మనం వస్తున్న చప్పుడు పట్టే రేగుపండ్లు తెస్తున్నం అని గుర్తుపట్టింది."

"గుర్తుపడితే పెట్టాలని వుందా ?"

"నీకు లేదేమో లేవలేని ముదుసలి కనుక నాకు పెట్టాలని పించింది పెట్టిన".

"ఇకనుండి నీ వెంటరానులే"

"రాకుంటే మానెయ్ గాని నీవు కొంత మారాలిర."

స్వామి ఓ మాదిరిగ శంకర్‌వైపు చూశాడు.

"అవును మనకు రావల్సినంతే మనం కోరుకోవాలి. ఈ పండ్లు ఎక్కువ రోజులున్న పాడైపోతవి కనుక మంచిగున్నప్పుడే మరొకరికి పెడితే వాళ్లు అవి పాడుకాక ముందే తింటారు కదా ?' అన్నాడు. అంతలో తన యిల్లు రాగానే శంకర్ యింట్లోకి నడిచాడు.

స్వామి ఆలోచిస్తు ఇంకా కొంచెం ముందున్న తనయింటి వైపు నడిచాడు.

●

# పొగతాగరాదు



అది సాయంత్రం వేళ. ఆటల సమయం.

పిల్లలంతా స్కూల్‌కు ఆనుకుని వున్న ఖాళీస్థలంలో ఆడుకుంటున్నారు.

టీచర్లు ఏదో విషయం మీద మాట్లాడుకుంటున్నారు.

వెంకట్ తన క్లాస్‌టీచర్‌ను పక్కకు పిలిచాడు.

"సార్ అదిగో" అంటు వేలితో కూలిన గోడవైపు చూపించాడు.

టీచర్‌కు ఎవరు కనిపించలేదు.

"ఏమిటో చెప్పర" అడిగాడు టీచర్.

వెంకట్ చెప్పక మళ్లీ వేలు చూయించాడు. టీచర్ గోడవైపు ఈసారి పరిశీలనగా చూశాడు.

గోడకు అవతలివైపు సుడులు సుడులుగ పొగ పైకి లేస్తువుంది.

"ఎక్కడిదిర ఆ పొగ" అడిగాడు టీచర్.

"అక్కడ రాము, జాని ఇద్దరు" అని ఆగిపోయాడు.

"ఇద్దరు ఏం చేస్తున్నారు" అంటు తన చూపుడువేలిని కదిలిస్తు సైగతో అడిగాడు.

"వాళ్లు - వాళ్లు" అంటు ఆగాడు వెంకట్.

"ఆఁ వాళ్లు ?" బీడీలు తాగుతున్నారు సార్ అని చెప్పి తన రెండుచేతులను వెనకకు పెట్టుకున్నాడు.

టీచర్, మెల్లగ వెళ్లి గోడమీదనుండి అవతలివైపుకు తొంగి చూశాడు.

ఇద్దరు ఎదురెదురుగ నిలుచోని పొగపీలుస్తున్నారు. అది చూసిన టీచర్ ముఖాన్ని చిట్లించుకుని -

"ఒరే ఏంచేస్తున్నార్ర ఇక్కడ?" గద్దించాడు టీచర్.

టీచర్ గొంతువిని ఒక్కసారె యిద్దరు ఉలిక్కిపడ్డారు. తలెత్తి టీచర్ వైపు చూశారు నోట్లోని పొగనోట్లోనే వుంది. పీల్చే బీడీలను కిందపడేసి చేతులు కట్టుకుని నిలుచున్నారు.

"రండిర ఇవతలికి రండి"

ఇద్దరు అక్కడినుండి కదిలారు. వాళ్లచూపులో భయం. నడకలో తడబాటు కనిపించింది.

"వీళ్లకు బీడీలు ఎక్కడివిర వెంకట్".

నాకు తెలవదన్నట్టు చూస్తు పెదవులను కదిలించాడు. కళ్లను ఓసారి మూసి తెరిచాడు.

ఈలోపు ఇద్దరు గోడచాటునుండి వచ్చి టీచర్‌కు కొంత దూరంగ నిలుచున్నారు.

"అక్కడ ఏంచేస్తున్నార్ర" టీచర్ ప్రశ్నించాడు.

ఇద్దరిలో ఎవ్వరు మాట్లాడలేదు.

"నేను చూశానుర, మీనోటితో గూడ చెప్పండిర" అడిగాడు టీచర్.

బిక్కుబిక్కుమని మౌనంగా చూస్తు వున్నారు పిల్లలంతా.

ఎవ్వరు నోరు విప్పలేదు.

"పొగ తాగడం తప్పని మీకు తెలుసుకదా ?"

అవును అన్నట్టు తలాడించారు.

"మరి -"

"బీడి తాగడంలేదు సార్" జాని.

"అవును సార్" రావు.

"బీడితాగంది మరి ఆపొగేమిటి"

"అది, అది" ఆగాడు జాని.

"అది బీరతీగె సార్" అన్నాడు రాము.

టీచర్ కొంచెం శాంతిస్తు -

"ఏది ఆ ముక్కలు తీసుకురండి"

సరె అంటు తలలూపుతు, వెళ్లి సగం కాలిన ముక్కలు తెచ్చారు. అవి ఇంకా కాలుతూనే వున్నాయి. వాటిని చూసిన టీచర్ -

"ఎండిన బీర తీగెను మీరు బీడిలాగ -" అనేలోపే, అవును అన్నట్టు తలలూపారు.

"ఒరె సన్యాసి వెధవల్లార ఏంపనిరయిది"

తప్పయింది అన్నట్టు చెంపలు వేసుకున్నారు.

"అది బీడో బీరతీగో, అసలు పొగ పీల్చడమే తప్పుర"

అవును అన్నట్టు చూశాడు వెంకట్.

"పొగ పీల్చడం వల్లా ఊపిరితిత్తులు చెడిపోతాయి. మళ్ళెప్పుడు ఈ పని చేయగూడదు. తోలు వొల్చేస్తాను జాగ్రత్త".

సరె అన్నట్టు చూశారు ఇద్దరు.

"జరిగిన దానికి చెంపలు వేసుకోండి" చేతులతో చెంపలమీద కొట్టుకున్నారు.

"పొండి, అందరితోపాటు ఆడుకోండి."

ఇద్దరు అక్కడినుండి కదిలేది చూస్తు -

"వరె జాని షర్ట్ గుండీలు పెట్టుకో".

మొలతాడు నుండి జారుతున్న రాము నిక్కర్ వైపు చూస్తు

"అరె రాము నిక్కర్‌ను సరిగ కట్టుకో" అన్నాడు.

రాము ఆగి, లాగు సర్దుకుని, ఆడుకుంటున్న పిల్లల్లో కలిసిపోయాడు. వాళ్ల వెనకాల వెంకట్ నడిచాడు.

# పెంకాసులు



టీచర్ పాఠం చెపుతువున్నాడు. వెనక బెంచిలో స్వామి, సంపత్ గుసగుస లాడుకున్నారు. పాఠం చెప్పడం ఆపి, "ఏమిటిర ఆ గుసగుస" అడిగాడు.

ఏంలేదు అన్నట్టు చూశారు ఇద్దరు.

"చెప్పర స్వామి ఏం సంగతి"

స్వామి మాట్లాడలేదు.

"నేను చెప్పత సార్" అంటు లేచి నిలుచున్నాడు సంపత్

"చెప్పు"

"సార్ ఈయన జేబులో పెంకాసులున్నాయి".

"ఔర స్వామి"

అవునన్నట్టు తలాడించాడు.

"ఇటుర"

వెళ్లి టీచర్ ముందు నిలుచున్నాడు. స్వామి జేబు నిండుగఉబ్బివున్నది.

"నీ జేబులో ఏం వున్నాయిర, ఏది తీసి ఈ టేబిల్ మీద పొయ్యి" అన్నాడు. స్వామి జేబులోని పెంకాసులను తీసి కుప్పపోసాడు.

"ఎక్కడ తెచ్చావురా, పెంటదిబ్బమీద ఏరుకుని తెచ్చావా ?"

అవును అన్నట్టు చూశాడు.

"పెంటదిబ్బ అంత చెండాలంగా వుంటుంది. దానిమీది పెంకులు ఏరుకుని నీవు జేబులో పోసుకున్నావు. తప్పుకదా ?" అన్నాడు టీచర్.

అవును, కాదు అనకుండ మౌనంగా నిలుచున్నాడు.

"వీటిని ఎందుకోసం ఏరుకున్నావు" టీచర్.

స్వామి మాట్లాడలేదు.

"అవి రూపాయలు అవుతాయట సార్" అన్నాడు సంపత్ ఏదోరహస్యం చెప్పినట్టు.

టీచర్ నవ్వుతూ "ఔర స్వామి"

స్వామి సిగ్గుపడుతు తలవంచుకుని నిలుచున్నాడు.

"పెంకాసులు రూపాయలు ఎట్లా అవుతాయిర"

"అయితయట సార్" సంపత్

"ఎవరన్నారు"

"స్వామే అన్నాడు సార్"

"అవుర స్వామి"

అవును అన్నట్టు తలాడించాడు.

"ఏది చెయ్యి చూస్తం" అన్నాడు టీచర్.

"చుట్టు తిప్పడానికి ఎముక కావాలి సార్"

అప్పుడు అర్థమైంది టీచర్‌కు. వీడు వీధిలో చూసినట్టుంది. తాను చెయ్యాలన్న ఆలోచన వచ్చినట్టుంది.

"స్వామి గారడివాడు చెయ్యంగ చూసినావుర" అన్నాడు స్వామి భుజాన్ని తాకుతు.

అవును అన్నట్లు నవ్వుముఖం పెట్టాడు స్వామి.

టీచర్ తాను నవ్వుతూ, "పాఠం రేపు చెపుతాను ఈ రోజు పెంకాసు రూపాయి ఎట్లా అవుతుందో చెపుతాను. పిల్లలు మీరందరు ఎప్పుడో ఓసారి గారడివాడి అట చూసివుండవచ్చు. అతను ఎన్నెన్నో మాయలు చేసి చూపెడతాడు. వాటిల్లో పెంకాసును రూపాయిగ మార్చడం ఒకటి. అట్లా చేయడాన్ని నేను చిన్నప్పుడు చూసి అబ్బుర పడ్డాను. పెంకాసు రూపాయిగ మార్చిండే ! ఈయన తనకు కావాల్సినప్పుడల్లా రూపాయిని చేసుకుంటాడేమో అనుకున్నాను. కాని మీరు కూడ అతన్నిచూసి వుండవచ్చు. ఆట ముగింపులో అందరిని పావలా - అర్ధరూపాయి అడుక్కొంటాడు."

"అవుసార్" అన్నారు ఒక్కసారే ఇద్దరు ముగ్గురు విద్యార్థులు.

"ఇక్కడ మీరు బాగ ఆలోచించండి".

విద్యార్థులందరు ఒకరిముఖాలు ఒకరు చూస్తు ఆలోచనల్లోకి వెళ్లారు.

"పెంకాసును రూపాయిగ మార్చె వ్యక్తి. తనకు అవసరమున్నప్పుడల్లా రూపాయిని చేసుకోవచ్చు. కానీ దేహి అని అడుక్కోవల్సిన అవసరం వుండదు."

పిల్లలు శ్రద్ధగా వింటువున్నారు.

"అంతెకదర"

"అవునుసార్" అన్నట్లు చూశారు.

"పెంకాసు రూపాయి ఎప్పటికి కాదు. తన ఆటసాగడానికి అలాగారడి చేస్తాడు. అంతే అదో నైపుణ్యం. హస్తలాఘవం. నిజంకాదు. అలాంటి ఆలోచనలు మీరు చేయకూడదు. స్వామి, వెళ్లి కూర్చే వీటన్నిటిని బయట పారెయ్యి" అంటు ముగిస్తాడు.

స్వామి పెంకాసులను తీసుకెళ్లి బయటపారవేస్తు "అవును అందరు పనిచేసే పైసలు సంపాదిస్తరు" అనుకున్నాడు మనస్సులో.

●

"నిలదీసింది. మరొకసారి నామీద చేయివేసావో నా సంగతి చూపిస్త" అని ఈడ్చుకపోయి నీళ్ల గోలెంలో తలను నాలుగుసార్లు పొదిగిన కోడిని ముంచినట్టు ముంచి వదిలింది. అప్పుడు అమ్మను చూస్తుంటే నాకు భయమేసింది.

చుట్టు పక్కల ఇండ్ల వాళ్లు, ఆడవొుగ అమ్మనే మెచ్చుకున్నారు.

"ఎన్నాళ్లని తన్నులు తింటది బాగ చేసింది" అన్నారు.

చేయనైతే చేసింది గాని అమ్మ మళ్లీ ఏడుస్తు కూర్చుంది.

"నీవు బాగచదివి, పైకొస్తేనే ఆమె బాధలు తప్పుతాయి." అన్నాడు వెంకట్.

"ఎట్లనో అట్ల ఓపికపట్టు. ఈ ఏడవతరగతి పూర్తికాగానే చెప్పచెయ్యకుండ వెళ్లి హాస్టల్లో చేరిపోదాం. ఆ తరువాత ఎంతైనా చదవొచ్చు."

"అదె చెయ్యాలె"

"చేద్దాం, నేను గూడవస్తకదా" అంటూ బడివైపు నడిచారు.

తల్లి, తండ్రి కంటె ఎక్కువ పనిచేస్తుంది. ఇంటిల్లి పాదికి చాకిరిచేస్తుంది. సంతానాన్ని పెంచి పెద్దచేస్తుంది. మామూలుగ బతకడానికి సంపాదించే తండ్రి తల్లిమీద, యింత సాగించడం ఎందుకో ఏ ఇంట్లో నైనా ఆ ఇంటి వ్యక్తి తన భార్యమీద ఏదోరకంగా సాధిస్తునే వుంటాడు. దానికి ఒకటె మందు. ఆమె సంతానం పెరిగి పెద్దవాళ్లయి విద్యాబుద్ధులు నేర్చుకుని, సంపాదించి అష్టకష్టాలపాలైన తల్లిని సుఖపెట్టటమే. అది తప్ప వాళ్లకు మోక్షం లేదు అనుకుంటు బడిగేట్లోకి అడుగు పెట్టారు. అప్పుడే ప్రార్థన గంట అయింది. వెళ్లి వరుసలో నిలుచున్నారు. అతని మనస్సు ప్రేయర్ మీద లేదు. 'భార్య-భర్తలు ఇద్దరు మనుషులే. ఇద్దరు సమానులే. మరి భార్య మీద భర్త పెత్తనం ఏమిటి ? ఎందుకు" అనుకున్నాడు.

# కాపాడితే - కాపాడును !



రమేష్‌ను ఆసుపత్రిలో ఉంచారు.

తోటి విద్యార్థులు టీచర్లు వెళ్లి చూసి వస్తున్నారు.

నుదురు భాగం, మోచేయి వరకు చేతులు కాలినయి.

అయింట్‌మెంట్ పూసి కదలకుండా పడుకొమ్మన్నారు.

వచ్చిపోయే జనం పడుకోనిస్తారా ? రమేష్ మంచి పిల్లవాడు. మంచి మార్కులు తెచ్చుకుంటాడు. వినయంగా వుంటాడు. అందువల్లా టీచర్లు కూడ యిష్టపడతారు. క్లాస్ టీచర్ జయప్రకాష్ రాగానే మంచం మీది రమేష్ కదిలి, చూపులను నేలవైపు మరలుచుకున్నాడు.

"చో, చో, ఎంతపని చేసుకున్నావుర"

రమేష్ కనురెప్పలు కన్నీటిని వొదిలినయి.

"కొంచెమైతే కళ్ళు పోయేవి కదర" అన్నాడు టీచర్.

రమేష్‌లో దుఃఖం పెరిగింది.

"ఇంకానయం ఎక్కువ కాలలేదు. పరవాలేదు బాగౌవు తుందిలే" అన్నాడు

రమేష్ ముఖంలో వెలుగు అల కనిపించింది.

టీచర్ మంచంమీద కూర్చోని చేత్తో రమేష్‌ను తాకుతు "త్వరలోనే కోలుకుంటావు" మళ్ళీ అన్నాడు.

రమేష్ నవ్వుముఖంతో కదిలి టీచర్ ముఖంలోకి చూశాడు.

"నిప్పుతో చెలగాటం మంచిదికాదుర అంటే వినరు. నీవెకాదు నీ సోదరులంతా అంతే కదర" అన్నాడు.

"పండగ కదా సార్" అన్నాడు పక్కన నిలుచున్న రమేష్ ఫ్రెండ్ సారథి. సారథి రమేష్ కంటే ఓ క్లాస్ ఎక్కువ.

"అవుర, పండగైతే పైసలను కాల్చడమేనా ?"

"అందరు" అని నసిగాడు సారథి.

"నేనంటాను అందరు పిచ్చివాళ్లే! ఒకడు ఏదో చేస్తే అంతా దాన్నే అనుసరిస్తారు. వెర్రివాళ్లుర ఉత్త వెర్రివాళ్లు. ఈ పండగల పేరుమీద మందు సామాగ్రిని కాల్చడం, ఎందుకంటా ? ఎంత ఘోరం జరిగి పోయిందో చూస్తున్నారు కదా ?'.

కొంతసేపు ఎవ్వరు మాట్లాడలేదు. రమేష్‌ను చూడడానికి మరికొంతమంది అక్కడికొచ్చి -

"ఇది నిన్నియాల్ల వచ్చిందా. వెనకట ఎప్పటినుండో వస్తావుంది" అన్నాడు పక్కింటి వ్యక్తి, అతని వృత్తి వ్యాపారం.

"అన్ని పండగలు - పబ్బాలు వెనకటినుండే వస్తా వున్నాయి. నేను కాదనను. కాలానుగుణంగా వచ్చే మార్పులను కూడ గమనించాలి. రోజు రోజుకు ఆలోచనలు పెరగడం లేదు ?" అంటు అందరివైపు చూశాడు.

అందరు మౌనంగా వింటువున్నారు.

"ఎప్పుడో ఓ రాక్షసుడు మునులను బాధ పెట్టాడని, వాన్ని భగవంతుని అవతారం చంపిందని, మనం ఈనాటికి దానిని పెద్ద

ఆర్భాటం చేసుకోవడం సరియైందేనా? అప్పోసప్పోచేసిన రూపాయలను కాల్చేసితే మిగిలేది ఏమిటి ? బూడిదెగ".

అందరు ఆలోచిస్తు నిలుచున్నారు.

"ఈ దయ్యాల పేర, దేవుళ్ళ పేర ధన-ధాన్యాలను బూడిద చెయ్యొద్దర్ర. చూడడానికి ఒక్క మనిషి సొమ్మైకావచ్చు కాని అది సమిష్టిగ చూస్తే దేశ సంపద. ఏ దేశ సంపద వృధా కావద్దు. అది అలా వుంచండి, ఇప్పుడు రమేష్ పరిస్థితి ఏమిటి ఇంకాస్త కాలితే దృష్టిని కోల్పోయే వాడుకదా, ఇట్లా ఈ దేశంలో ఎంతోమంది ఇదే విధంగా చేస్తునేవున్నారు. వొళ్లు ఇల్లును బూడిద చేసుకుంటునే వున్నారు. అంతేకాదు ఎందరో ప్రాణాలను పోగొట్టుకుంటున్నారు. నేను చెప్పొచ్చేది ఏమిటి అంటే పండగలపేర ఆపదను, అనర్థాలనుకొని తెచ్చుకోవద్దు.

ప్రతి రూపాయి చెమటోడ్చితేనే వస్తుంది. అందుకని రూపాయిని, మనం కాపాడితే అది మనల కాపాడుతుందని, గుర్తుంచుకోండి. చెప్పాలంటే యింకాచాల వుంది. ఇది సమయం కాదు. వస్త రమేష్. త్వరలోనే కోలుకుంటావులే", అంటు జయప్రకాష్‌లేచి వరండావైపు నడిచాడు. ఆయనవెంట మిగతా విద్యార్థులు నడుస్తు వున్నారు.

"సార్ మీరు దేవున్ని నమ్మర" అని అడిగాడు వెనక వస్తూవున్న సారథి.

జయప్రకాష్ నవ్వుతు వెనక్కు మళ్లి సారథివైపు చూశాడు.

నడుస్తున్న సారథి ఓ క్షణం ఆగాడు.

"ఒరె సారథి దేవున్ని నమ్మడం నమ్మకపోవడం ఇక్కడ అప్రస్తుతం. నేను మాట్లాడేది పండగల పేరుమీద పెట్టి వృధా ఖర్చులగురించి, మూఢనమ్మకాలతో మనిషి చేస్తున్న ముదునష్టపు

పనుల గురించి, ఇంకొంచెం ఆలోచిస్తే పల్లెల్లో గ్రామ దేవతలకు అర్పించే జంతుబలుల గురించి, రాళ్లముందు వడ్డించే బోనాల గురించి, మనిషి తాగితే దేవునికి తాగుడు పొయ్యడం చేస్తుంటారు కదా, యివన్నీ అటవిక యుగంలో అడవిమనుషులు చేసినవి. ఈ ఆధునిక యుగంలో కూడనా ? వాటి పేరుతో ఎంత సంపద మట్టిపాలై పోతోందో ఆలోచించండి".

ఈ లోపల జయప్రకాష్ ఇల్లు వచ్చింది. వాకిట్లో ఆగారు.

"ఎవరైనా సరే కష్టించి సంపాదించుకున్నది అగ్గి పాలు చెయ్యొద్దు. పేదరికాన్ని పెంచుకోవద్దు. అసలే మనదేశ ఆర్థిక పరిస్థితి అంతంతమాత్రం. ఉన్న వనరులను అతి జాగ్రత్తగా వాడుకోవాలి. లేకపోతే పేదరికం ఇంకా పెరిగిపోతుంది సుమా ! ఇప్పుడు మీరున్నది కంప్యూటర్ యుగం. ముందు ముందు మీకే తెలుస్తుంది. మరోసారి మాట్లాడుకుందాం ఉంటా". అంటు ఇంట్లోకి నడిచాడు.



# మంచిమార్కులు రావాలంటే ---!



ఆ రోజు మధ్యాహ్నానికి స్కూల్ వార్షిక పరీక్షలు ముగిసినయి. ఆదే సాయంత్రం ఓ సమావేశాన్ని ఏర్పాటుచేశారు. పిల్లలు టీచర్లు అందరు వున్నారు. ప్రధానోపాధ్యాయుడు లేచి -

"తోటి మిత్రులారా, ప్రియమైన విద్యార్థులారా.

మీరు పరీక్షల్లో పాసై పై తరగతులకు వెడతారు. ఏడవ తరగతి వాళ్లు ఉన్నత పాఠశాలలకు వెడతారు. పై తరగతుల్లో పాఠ్యాంశాలు ఇంకా వివరంగా వుంటాయి. కాస్త కఠినంగా కూడ వుంటాయి. మీరు ఇంకా ఎక్కువ శ్రద్ధ చూపించవల్సివుంటుంది. వెనక బడితె వెనకే. పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్న ప్రైవేట్ స్కూల్లలో చదువును కొనడం జరుగుతుంది". అనగానే టీచర్లు చప్పట్లు కొట్టారు. పిల్లలు వాళ్లతోపాటు చేతులు కలిపారు.

"దురదృష్టకరం ఏమిటి అంటే స్కూల్ వాళ్లె పిల్లలకు అక్రమ పద్ధతులను నేర్పుతువున్నారు. మార్కులు ఎక్కువ వచ్చేటట్లు చూస్తువున్నారు. మనం పేపర్లలో చూస్తువున్నాం. తల్లి-తండ్రులు కూడ అప్పుచేసి పిల్లలను ప్రైవేట్‌గానే

చదివిస్తున్నారు. ప్రభుత్వ పాఠశాలల్లో చదివే పిల్లలు బాగా చదవాలి. ఎక్కువ మార్కులు తెచ్చుకొని తెలివితేటలను పెంచుకోవాలి. బాగా చదువుకున్న వాళ్లకు మంచి వుద్యోగాలు వస్తాయి. సంఘంలో గౌరవ మర్యాదలు వుంటాయి.

నిన్నమొన్న మీరు రాసిన ఆన్సర్ పేపర్లను దిద్దినాను. ప్రశ్నలకు మీరు జవాబు యిచ్చిన తీరు సరిగలేదు. విషయవివరణ అంతబాగా లేదు. పాఠాలు చెప్పేటప్పుడు బాగా వినాలి. మనస్సు ఎక్కడో పెడితే పాఠం అర్థంకాదు. నేను మీకు కొన్ని చిట్కాలు చెపుతాను. గుర్తుంచుకుంటారు కదా." అన్నాడు. అది విన్న విద్యార్థులు ఏకాగ్రత చూపులతో టీచర్‌వైపు చెవులుంచారు.

"ప్రతి విద్యార్థి ఇంటి దగ్గర చదువుకోసం కొంత సమయాన్ని ఎంచుకోవాలి. చదివేటప్పుడు బుర్రలో మరోవిషయానికి తావు ఇవ్వకూడదు. చదువ దలుచుకున్న పుస్తకాన్ని తీసుకోవాలి. ఒక వేళ అది ఇంగ్లీషు సబ్జెక్టు అయితే డిక్షనరి దగ్గరుంచుకోవాలి. తెలియని పదం వుంటే అందులోచూసి అర్థం తెలుసుకోవాలి. ఆ అర్థాన్ని సంబంధిత పదం పక్కన రాసి వుంచుకుంటే యింకా మంచిది. ఒకే పాఠాన్ని రెండు మూడు సార్లు చదవాలి. ముఖ్యమైన పేరాలను పెన్సిల్‌తో అండర్‌లైన్ చేసుకోవాలి. ఆ తరువాత చదివేటపుడు మొత్తం పాఠం చదవ అక్కరలేదు. అండర్‌లైన్ చేసిన అంశాలు చదివితే చాలు పాఠం అర్థం అవుతుంది. ఇకమీరు పరీక్షల్లోని ప్రశ్నలకు సులభంగా జవాబు రాయగలరు. రాస్తారు. మంచి మార్కులు వస్తాయి" అన్నాడు.

పిల్లలంతా ఏదో రహస్యాన్ని తెలుసుకున్నట్టు చప్పట్లు కొట్టారు. అల్లావుద్దీన్ అద్భుత దీపం దొరికినట్టు నవ్వు ముఖాలతో ఒకరినొకరు చూసుకున్నారు.

"పిల్లలు ఈ పద్ధతికి మీరు అలవాటు పడితే ముందు ముందు పై తరగతుల్లో కూడ మీరు సరియైన జవాబులు రాయగలరు. మంచి మార్కులు వస్తాయి. దాంతో మీ టీచర్లు మిమ్మల యిష్టపడతారు. తల్లి - తండ్రులు ఎక్కువ ప్రేమతో చూస్తారు. కాలేజీల్లో రాంకులు సాధిస్తారు". పిల్లలు మళ్లీ చప్పట్లు కొట్టారు.

ప్రధానోపాధ్యాయులుగారు మిగతా టీచర్లవైపు చూస్తు "మీలో ఎవరైన మాట్లాడుతారా" అన్నప్పుడు తెలుగు పండితులుగారు లేచి -

"ప్రధానోపాధ్యాయులవారు, తోటి ఉపాధ్యాయులు, ప్రియమైన విద్యార్థులారా, నాకంటె ముందు మన ప్రధానోపాధ్యాయులవారు మీకు చాలా విషయాలను వివరించారు. ఇది కంప్యూటర్ కాలం. లెక్కలు, సైన్స్ మొదటి స్థానంలో వున్నాయి. భవిష్యత్తులో కూడ వాటికే స్థానం కనిపిస్తుంది. అయినా భాషను మరవద్దు. అన్నిటికి భాషే మూలం. ఈ ఇంగ్లీష్ కల్చర్ వల్లా మాతృభాష శబ్దం, రూపం మారిపోతువుంది. ఎందువల్ల అంటే స్కూల్లో ఓ తీరు భాషను చదువుతున్నాం. ఇంట బయట ఓ తీరు భాషను మాట్లాడుతున్నాం. చాల ఇంగ్లీష్ పదాలు తెలుగు వాక్యాలలో చోటు చేసుకుంటున్నాయి. అయినా అసలు మాతృభాషను మరవద్దు. మాతృభాషలోని కొన్ని పదాలు మారిపోతున్నాయి. కాదనను. కావ్యపఠనంద్వార మనం భాషను కొంతైన కాపాడుకోవచ్చు. అందుకోసం పంచకావ్యాలను చదవకపోయినా సులభంగా అర్థం అయ్యేకావ్యాలనైనా చదవాలి. 'వేమన పద్యాలను' కంఠతపడితే, పదాలను పలకడం తెలిసిపోతుంది. మునుముందు 'ముత్యాలసరాలు' లాంటి

పుస్తకాలు చదివితే ఇంకెంతో తెలుస్తుంది. అందువల్లా మీరేమైనా చదవండి, భాషను కాపాడుకోవాలి. శెలవు” అంటు కూర్చున్నాడు.

“ఇంకెవరైనా” అన్నట్టు చూశాడు.

లేదు అన్నట్టు తలలూపారు మిగతా టీచర్లు.

“మీరు మీ మీ ఇండ్లకు వెళ్లొచ్చు. జూన్ ‘5’న స్కూల్స్ తెరుస్తారు. ఉన్నత పాఠశాలకు ‘8’వ తరగతికి వెళ్లే వాళ్ల టి.సి.లు కూడ అప్పటివరకు సిద్ధంగా వుంటాయి” అంటు లేచి బయటికి నడిచాడు. మిగతా టీచర్లు, ఆయనను అనుసరించారు.

‘మంచి మార్కులు రావాలంటే సార్ చెప్పినట్టు బాగ రెండు, మూడు సార్లు చదవాలన్నమాట’, అనుకుంటు వాళ్ళ వెనకాల విద్యార్థులూ నడిచారు.

●